

*Photo by R. Krishnan, Madras*



చెడిపోయేపిల్లవాడు !



నాజూకుకు..
నాణ్యానికి..
మన్నికకు..

ప్రసిద్ధిగాంచిన పింగాణీ వస్తువులు.

## ఇండియా సిరామిక్స్ లిమిటెడ్

నెల్లూరు :: కాళహస్తి : మద్రాసు

---

తిలక్ మార్కు గడియారం మార్కు

## మిస్కీ ఇంగువ కర్పూరం

మెంతాల్, వోమంపువ్వు

టోకుగాను, చిల్లరగాను సరసమైన ధరలకు దొరుకును

---

గోపాల్జీ చాంప్షీ అండ్ కంపెనీ

30, గోవిందప్ప నాయకన్‌వీధి, జి. టి. మద్రాసు.




సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 2 | ఏప్రెల్, 1948 | సంచిక 4

## పాపలూ

కొత్త సంవత్సరం వచ్చింది. కొత్త బట్టలు కట్టండి. ఈ సంవత్సరమంతా మీరు కొత్త బట్టలే కడతారు. ఆవాళ పిల్లలతో పోట్లాడకండి; మీరు ఈ సంవత్సరమంతా తగువులు లేకుండా ఉంటారు. ఆవాళ మీ జేబులో ఉన్న డబ్బు ఖర్చు పెట్టకండి; ఈ సంవత్సరమంతా మీజేబులో డబ్బు ఉంటుంది. ఇది నేనుచెప్పటంకాదు; మీ నాయనా, అమ్మా, తాతా, జేజీ అందరి నమ్మకమూను.

పోతే ఈ నెలలో మన కొక పండగ వస్తున్నది. శ్రీరాముల నవమి. రాములవారు ఆనాడే పుట్టారు. వారి కథే రామాయణము. రామాయణాన్ని 'కట్టె, కొట్టె, తెచ్చె' అని మూడు మాటలలో చెప్పవచ్చు. పెంచి చెప్పమంటారా? అబ్బో, అది చాలారోజులు పట్టుతుంది. తర్వాత విందురుగాననిలే.




శ్రీలొప్ప రమణీయసీమ భారతము
కర్మభూమని ఖ్యాతిగన్న భారతము;
పుణ్యనదులున్నదీ భూమి భారతము
పుణ్యాత్ములున్నదీ భూమి భారతము
ప్రాచీనమైనదీ భరతదేశమ్ము
బంగారు భూమిరా భరతదేశమ్ము
దేశభక్తులగన్న దివ్యదేశమ్ము
వీరనారులగన్న విమలదేశమ్ము
రామకృష్ణులగన్న రమ్యదేశమ్ము
బాలవీరులకెల్ల నాలవాలమ్ము.
శూరులకు నిలయమ్ము వీరభారతము
త్యాగపురుషులగన్న ధరణి భారతము;
శ్రీరాముడేలిన సీమ భారతము
శ్రీలొప్పరమణీయ సీమ భారతము.
ప్రాగ్భాగమునగలదు భరతదేశమ్ము
వినుము బాలా దాని విమలచరితమ్ము
శ్రీరామ చరితమ్ము చెవులకునువిందు
సొంపుగా నాలించి శుభములను పొందు,

భరతదేశోత్తర భాగమ్మునందు
అయోధ్య యనురాజ్యమలరారుచుండు;
దశరథ మహరాజు దానిపాలకుడు
రాక్షసుల జంపినరాజు దశరథుడు.
దశరథ భూజాని ధర్మపాలనలో
చీకుచింతయులేక శ్రీసౌఖ్యములతొ
హాయిగా నున్నారు అయోధ్య ప్రజలు
అదృష్టశాలు రాఅయోధ్య ప్రజలు.
ప్రభువునకు కౌసల్య పట్టంపురాణి
కైకేయి ప్రభువునకు కడుగూర్చురాణి
రామసద్గుణరాసి రాణీ సుమిత్ర
వినుము బాలా వారి విమలచారిత్ర.
దేశమ్ములోకెల్ల దివ్యభవనాలు
ముగ్గురూ రాణీల మూడు భవనాలు
రంగురంగులమేడ, హంగైనమేడ
చలువరాతిమేడ, చక్కనీమేడ;
వింతవస్తూచయమ దెంతయోగలదు.
ఐశ్వర్యమంతయూ నచ్చటేగలదు.

కంచర్ల చినగురువుశెట్టి, విశాఖపట్టణము

ఇల్లు చక్కనిదయ్యి ఏమిలాభమ్ము?
ఇల్లాలు చక్కనీ దేమిలాభమ్ము?
ఎన్నిభోగాలున్న నేమిలాభమ్ము?
పకపకానవ్వేటి పాపాయిలేక;
భవనముకు వెలుగిచ్చు బాలుండులేక!
ఇల్లు చిన్నావోయె నేమి చెప్పుదును?
ఇల్లాలు మనసులో నిదియేనుచింత,
పతితోను చెప్పింది మదిలోనివంత;
ఇల్లాలుపేరేమి? ఇంతికౌసల్య;
దశరథునిరాణి యాతన్వికౌసల్య;
దశరథ మహారాజు యశమువింటేను,
క్రూరరాక్షసమూక గుండెలదరేను.
గురువుచెంతకుజేరి సరపాలుడంత
మరుగులేకనుదెల్పె మనసులోచింత;
వసిష్ఠుడంతటను పల్కెనీవిధము;
"చింతయేలనురాజ! వంతనూవిడుము,
పుత్రకామేష్ఠినా భూరియజ్ఞమును
ఘనముగా నెరవేర్చి కనుముపుత్రులను."
గురువాసతిచ్చిన వెరవునకునాడు
మిగులసంతసమందె మేదినీ వరుడు
శీఘ్రముగ యజ్ఞమును చేయనూహించె
ఋష్యశృంగ మహాఋషిని రావించె
ఆ మహానుభావుని యాధ్వర్యమునను
సతులతో మహరాజు సలిపె జన్నమును.

యజ్ఞపురుషుండంత నావిర్భవించి,
ఆరాజుచేత పాయసపాత్రనుంచి
యదృశ్యుడై పోయె; నాపాయసమును
దశరథుడుపంచెనూ తన భార్యలకును;
ముదముతో దానినీ ముగ్గురునుతినిరి
కాంతలూ ముగ్గురును గర్భవతులైరి.
శుక్లపక్షమునందు, శుభలగ్నమునను
చైత్రనవమీనాడు, సర్వశోభితుని,
ప్రసవించె కౌసల్య పాపాయినొకని,
మేఘవర్ణముగలా మేనుగలవాని;
నీలాలకాంతివలె నిగనిగలాడు
అందాలరాసిరా యా రాజసుతుడు;
గొప్పగొప్ప ఋషులు కూడివచ్చారు,
శ్రీరాముడంచునూ పేరుపెట్టేరు
కైకేయి తర్వాత కనెను బాలకుని
మూడుమూర్తుల రాము బోలెడూవాని;
భరతుడనియెడిపేరు వానికుంచారు,
మెరుపు తీగలబోలు మేనుగలవారు,
కలిగిరి సుమిత్రకూ కవలబాలకులు,
లక్ష్మణ శత్రుఘ్నులని వారిపేర్లు
శ్రీరామ చరితమ్ము చెవులకునువిందు.
సొంపుగానాలించి శుభములనుపొందు.

# గేయ కథలు

ఏటుకూరి

## కోడి - కుంపటి



గుగ్గిళ్లమ్మ ముసలాబిడ యొక
కోడిని సంపాదించిందీ
గ్రుడ్లూ, గుగ్గి ళ్లుడక పెట్టుటకు
కుంప టొకటి తెప్పించింది.

ఎప్పుడు తనకడ కమ్మలక్కలూ
నిప్పుకు నీళ్లకు వస్తుంటే
కుంపటి కోడిని చంకబెట్టుకొని
కొండ దాపునకు చేరింది.

తెల్లవాఱి తన యూరి చాకలా
తెరవున బోవుట చూచిందీ
ఓరన్నా! యిటు రమ్మని చెంతకు
చేరబిలిచి యిట్లడిగింది.

మన గ్రామములో వేగుబోకనే
జను లెల్లరు మేల్కొన్నారా?
అమ్మలక్క లిదివఱకు మోస్తరే
అన్నిపొయులు రాజేశారా?

దీని రహస్యము దెలియక చాకలి
తిప్పుడు తికమక పడ్డాడూ
నేనే మేల్కొన్నానో లేదని
తానే సంశయ పడ్డాడు.

ముసలవ్వయు తన కోడీ, కుంపటి
మోసము చేసిన వనుకొందీ
కూత గూసి, పొయి రాజబెట్టి మఱి
కొండ జేరెనని మిణికింది.

ఔనని చాకలి కోడిపుంజువై
పాట్టే నిలబడి చూస్తుంటే
కత్తి దెచ్చి ముసలమ్మ కోడిమెడ
నుత్తరించుటకు నిచ్చింది.

కోప మ్మాగక రాతికేసి తన
కుంపటి బ్రద్దలు చేసిందీ
చేతులుకాళ్లను ముందుపెట్టుకొని
చివరకు లబలబ లాడింది.



మూఢులు లోకము తమతోనుందని - మున్నరికలు పోతుంటారూ
తోచీ తోచని పను లొనరిస్తూ - తుట్టతుదకు చెడిపోతారు.






















## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

ఇక్కడ తొమ్మిది మంది సర్కస్ బఫూనులు వున్నారు. తొమ్మిదిమందీ, ఒకే మోస్తరుగావున్నట్లు కనిపిస్తున్నారుకదూ? కాని అందరూ ఒక మోస్తరు వాళ్లుకారు. తొమ్మిదిమందిలోనూ ఇద్దరు మాత్రమే ఒకే మోస్తరుగా వుంటారు. మిగతా ఏడుగురూ ఏడురకాలుగా వుంటారు. ఒకే మోస్తరుగావున్న ఆ యిద్దరూ ఎవరో కనుక్కోండి, చూదాం? మీరు కనుక్కోలేకపోతే, జవాబు యింకో పేజీలోవుంది, చూడండి.

# రోకంటి పాటలు

రోకలెత్తలేను రోలెత్తలేను,
నామంచి కడియాల చెయ్యెత్తలేను.
కోటకు పోటాశ పొరుగు నాకాశ,
కంటికీ రెప్పాశ శ్రీ వెంకటేశ.

గుమ్మడీ కాయంటి గురువొచ్చినాడు,
సీకాయ పంచెలతొ శిశువెళ్లినాడు,
కాళ్లు కడగనైతి కని మ్రొక్కనైతి,
వంగి దణ్ణంబెట్టి వరమడగనైతి.
నాతోడివారెల్ల నానులడిగితిరి,
నే నొక్కటడిగితి అయిదవతనము.
చాలు ఐదోతనము సంతానబలము,
కోటి ఐదోతనము కొమరులబలము.

పడుచువారము మేము పనిచేయలేము,
పగులు వెన్నెలగాయి ఓ చందమామ.
పొద్దులు గూకితే మేముండలేము,
బుద్ధులు చెప్పవే భూదేవి తల్లి.
సందెల్లు గూకితే మేముండలేము,
సంతాన మీయవే ఓ చందమామ.

సంపాదన: ఈదర బసవపూర్ణమ్మ, అయితానగర్, తెనాలి.




అనగనగా ఒకదేశం. ఆ దేశానికి ఒక రాజు. ఆ రాజుకి ఓ చక్కటి రాణీ. ఆ రాణీకి, పాపం ఎంతకాలానికీ బిడ్డలు పుట్టలేదు. అందువల్ల రాజుగారికి పెద్ద దిగులు పట్టుకుంది. రాజుగారు యింకో చక్కటి పిల్లనిచూసి పెళ్లిచేసుకున్నారు. ఆ పిల్ల చాల అందంగానూ, ఎంతో బుద్ధి మంతురాలుగానూ ఉండేది.

రాజుగారు ఈ పిల్లని పెళ్లిచేసుకున్న కొద్దిరోజులకే ఆమె కడుపుతో వుంది. ఈసంగతి పెద్దభార్య అయిన రాణీకి తెలిసింది. ఆమె కోపానికి అంతులేకుండా పోయింది. అదీగాక చిన్నభార్య కడుపుతో వున్నదగ్గర్నించీ రాజు ఆమెని అదివరకటి కంటే యింకా ఎక్కువగా ప్రేమించటం మొదలెట్టాడు.

నెలలు దొర్లిపోయినై. చిన్నభార్యకి తొమ్మిదినెలలు నిండినై. ఆరోజు రాజుగారు అడవికి వేటకు బయలుదేరారు. బయలు దేరేముందు, చిన్నభార్య దగ్గిరికివచ్చి, "నేను వేటకుపోతున్నాను. ఇంక కాసేపటికి ప్రసవిస్తావనంగా, మన దివాణంలో గంట మ్రోగించు. అది వినంగానే నేను తిరిగివస్తాను" అని చెప్పి రాజు అడవికి వెళ్లిపోయాడు.

మరికొన్నిరోజులు గడిచినై. చిన్నభార్యకు కవలపిల్లలు పుట్టారు. ఇద్దరూ మగపిల్లలే. ఇదిచూసేసరికి పెద్దభార్యకు ఒళ్లు మండిపోయింది. చిన్నభార్యకు ఏదో మత్తు మందు యిచ్చింది. ఆమెకు తెలివితప్పి పోగానే ఆ కవలపిల్ల లిద్దర్నీ దాసీలకిచ్చి పక్కనేవున్న తోటలో పడుకోబెట్టించింది. చిన్నభార్య పక్కలో రెండు కొయ్య మొద్దులు పెట్టి వెంటనేవెళ్లి దివాణంగంట మోగించింది. దాసీలు ఈసంగతి బైటపెట్టకుండా వుండేందుకు వాళ్ళకు బోలెడంత డబ్బు లంచం యిచ్చింది.

దివాణం గంట, వేటాడుతున్న రాజు విన్నాడు. బిడ్డపుటాడుగదా అన్న సంతోషంతో వెంటనే రాజ్యానికి తిరిగివచ్చాడు. రాజు తిరిగిరాగానే పెద్దభార్య అతనిదగ్గిరికి వెళ్లి, "మీ చిన్నభార్య రెండు కొయ్య మొద్దుల్ని కన్నది చూశారా!" అన్నది, ఎంతో విచారపడుతున్నదానిలా. పాపం, రాజు నిజమేగదానని నమ్మాడు. అయినా ఏంచేస్తాడు? నాలుగురోజులువిచారించాడు.

డి. రామచంద్రమూర్తి, భీమవరం.

తర్వాత ఎలాగైతే నేం ఆసంగతి మరిచి పోయి మామూలుగా ఉంటున్నాడు.

ఇక అక్కడ మామిడితోటలో వున్న పిల్లలసంగతి ఏమైందో తెలుసా? ఒక అవ్వ ఆ పిల్లల్నిచూసి, వాళ్ళని తీసుకుపోయి పెంచుకుంటోంది. మంచి ఆహారం అదీపెట్టి ఎంతో ముద్దుగా పెంచుతోంది. రోజులు గడిచినకొద్దీ రాజకుమారులిద్దరూ చక్కగా పెరిగి పెద్దవారైనారు. అదీగాక కవలపిల్లలు గనక చూసేవాళ్లకి ఎంతో ముద్దొస్తూండేవారు.

ఇలా అయిదేళ్లు గడిచిపోయినై. ఒక రోజున ఆ రాజకుమారులు అవ్వని అడిగారుగదా, "అవ్వా, అవ్వా! మా అమ్మా, నాన్నా ఎక్కడ వున్నారు? వాళ్ళని మాకు చూపిస్తావా?" అని.

అప్పుడు అవ్వ ఏమని చెప్పిందంటే, "నాయనలారా, మీతండ్రి ఇంకెవరో కాదు. ఈవూరి రాజే! మీ తండ్రికి యిద్దరు భార్యలు. అందులో చిన్నభార్యే మీతల్లి. మీ పెత్తల్లే మిమ్మల్ని, మీరు పుట్టంగానే మీ తల్లికి తెలియకుండా తెచ్చి మామిడి తోటలో వదిలిపెట్టి వెళ్ళింది. మీ తండ్రితో, మీ అమ్మకు రెండు కొయ్యముద్దులు పుట్టినై అనిచెప్పి మోసంచేసింది. నిజమే నని అని మీతండ్రి నమ్మాడు. ఆరోజు మొదలు నేనే మిమ్మల్ని పెంచుతున్నాను" అన్నది.



ఇది వినంగానే రాజకుమారులు "అదా సంగతి" అని, మామూలుగా ఆడుకోటానికి వెళ్ళిపోయారు. వీళ్ళు ఆడుకునేచోటు రాజుగారి అంతఃపురంనించి బాగా కనిపిస్తూ వుంటుంది. రోజూ రాజు వాళ్ళు ఆడుకుంటూ వుండటం మేడమీదనించి చూస్తుండేవాడు. వాళ్ళ ముద్దుమొహాలు కళకళలాడుతూ వుంటే రాజు అలాగే రెప్పవాల్చకుండా చూస్తుండేవాడు.

"ఇంతటి అందాల ముద్దుబిడ్డల్ని కన్న ఆ తలిదండ్రులెవరో! వాళ్లు ఏంపుణ్యంచేసి వీళ్ళని కన్నారోగదా! నాకర్మ యిలా రాసి వుంది కాబోలు. రెండోభార్య కడుపుతో వుందిగదా అని ఎంతో ఆశపడ్డాను. ఆ ఆశ చివరికి నిరాశ అయింది. పైగా రెండు



కొయ్యమొద్దులు పుట్టటమేమిటి నాకు, అప్రతిష్టకు కాకపోతే!" అని ఎంతో విచారించేవాడు.

ఇలావుండగా ఒకరోజున రాజు పళ్లు తోముకుంటూ షికారుగా ఆ తోటలోకి వచ్చాడు. ఇంతలో రాజకుమారు లిద్దరూ ఆడుకుంటూ అక్కడికి వచ్చారు. ఒక పిల్లవాడు ఒక కొయ్య ఏనుగుని తాడుకట్టి లాగుతున్నాడు. రెండోవాడు ఒక మట్టి ఏనుగుని లాగుతున్నాడు. కొయ్య ఏనుగుని లాగుతున్న పిల్లవాడు ఏనుగుని ఒక నీళ్ళ గుంటదగ్గిరికి లాక్కుపోయి, "ఏనుగమ్మా, ఏనుగమ్మా! నీళ్లుతాగు" అన్నాడు. అది చూసి రెండో పిల్లవాడుకూడా ఏనుగని గుంటదగ్గిరికి లాక్కొచ్చి, "ఏనుగమ్మా, ఏనుగమ్మా! నువ్వుకూడా నీళ్లు తాగు" అన్నాడు. ఇదంతా అక్కడవున్న రాజు విన్నాడు విని, వాళ్లదగ్గిరికివచ్చి, "అబ్బాయిలూ, ఎక్కడన్నా మట్టిఏనుగలు, కొయ్య ఏనుగలు నీళ్లుతాగుతయ్యా!" అని అడిగాడు.

వెంటనే పిల్లలిద్దరూ ఒక్కసారిగా ఏమన్నారో తెలుసా? "ఎందుకు తాగవ్? మతిలేని రాజుకి కొయ్యపిల్లలు పుడితే, కొయ్య ఏనుగలూ, మట్టి ఏనుగలూకూడా నీళ్లుతాగుతై" అన్నారు.

పిల్లలిద్దరూ యిలా తెలివిగా సమాధానం చెప్పేసరికి రాజు ఒక్కసారిగా అశ్చర్యపోయాడు. వాళ్ళమాటలు రాజుమనస్సుకి బాణాల్లా గుచ్చుకున్నాయి. అప్పుడు రాజు ఏమనుకున్నాడంటే "వీళ్లు చూడబోతే యింకా అయిదేళ్ళన్నా నిండలేదే. నాచిన్న భార్యకు కొయ్యపిల్లలు పుట్టినసంగతి జరిగి అయిదేళ్ళకుపైన అయింది. వీళ్లకి ఆ సంగతి ఎలా తెలిసివుంటుంది. ఇందులో ఏదో రహస్యం తప్పకుండా వుంటుంది" అని అనుకుని, రాజు, "అబ్బాయిలూ, మీరుచెప్పింది నిజమే. అయితే మీరు ఎవరి పిల్లలో చెబుతారా?" అని అడిగాడు.

అప్పుడు అయిద్దరు పిల్లలూ యిలా అన్నారు - "మేము ఈదేశాన్ని ఏలుతున్న రాజు కొడుకులం. మేము పుట్టినప్పట్నించీ, మమ్మల్ని ఆయింట్లోవున్న అవ్వ పెంచు

తోంది" అని అవ్వ యింటివేపు చూపారు.

రాజు వెంటనే అక్కడ్నించి అవ్వ యింటికివచ్చి, ఆ పిల్లల సంగతంతా అడిగి తెలుసుకున్నాడు. ఇంతలోకే పిల్లలిద్దరూ కూడా యింటికి తిరిగివచ్చారు. రాజుకి వాళ్ళని చూసేసరికి ఎంతో ఆనందం కలిగింది. అవ్వచెప్పిందంతా వినేసరికి, పెద్దభార్యచేసిన మోసానికి ఎంతో కోపం వచ్చింది.

వెంటనే అంతఃపురానికి తిరిగి వచ్చి పెద్దభార్యని పిలిచాడు. రాణీవచ్చి రాజుఎదట నిలబడింది. అప్పుడు రాజు, "నాకు కొయ్యపిల్లలు పుట్టినై అని చెప్పావు. అది నిజమా, అబద్ధమా?" అని గద్దించి అడిగాడు. ఆప్రశ్న వినేసరికి రాణి తెల్లబోయింది. జరిగిందంతా ఎంతో భయపడుతూ రాజుకు చెప్పేసింది.

అంతాచెప్పి చివరికి పెద్దగా ఏడవటం మొదలెట్టింది. తర్వాత, రాజు కాళ్ళమీద పడి, తనని క్షమించమని బ్రతిమాలుకుంది. ఇదంతా వింటున్న చిన్నరాణి రాజు ఎదటికివచ్చి, పెద్దరాణీని క్షమించమని రాజుని కోరింది. రాజు సరేనని పెద్దరాణీని క్షమించి, "ఇకనించి అయినా ఒళ్లు దగ్గర బెట్టుకొని బ్రతుకు. ఇంకోసారి నన్ను మోసం చెయ్యాలని ప్రయత్నించావంటే నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి పారేస్తాను" అని చెప్పాడు.



తర్వాత ఒక మంచిరోజుచూసి రాజు అవ్వనీ, పిల్లల్నీ తన అంతఃపురానికి పిలిపించాడు. పిల్లల్ని చూడగానే చిన్నరాణి ఒక్కసారివెళ్లి వాళ్లని కావిలించుకుంది. తర్వాత అవ్వనికూడా రాజుగారి అంతఃపురంలోనే వుండమని కోరారు. అవ్వ సరేనని అంది. ఆరోజు రాజ్యమంతటా చాటింపువేయించి గొప్ప విందు జరిపారు.

తర్వాత రాజు, రాణి, పిల్లలూ, అవ్వ సుఖంగా వున్నారు. పెద్దరాణి మాత్రం తలెత్తుకు తిరగలేక అంతఃపురంలోనే ఒక గదిలో వుంటూ ఎలాగో కాలం వెళ్లబుచ్చుతోంది. అంతటితో కథ కంచికివెళ్లింది మనం యింటికివచ్చాం.



# వీరలక్ష్మి

పెద్దక్కయ్య



[గతసంచిక తరువాయి]

ఇంక తను, అక్కడ దణ్ణెంమీదవేళ్లాడు తున్న పట్టుచీరల్లో ఒక మంచి జరీ బనారసు చీరతీసి కట్టుకుని, దానిపైన చింపిరి గుడ్డలన్నీ చుట్టుకుని తల విరబోసుకుని, మొహంనిండా పసుపు పూసుకుని, పెద్ద కుంఖంబొట్టు పెట్టుకుని, ఒక పళ్ళెంలో ఒక దివ్వె వెలిగించి నెత్తిమీదపెట్టుకుని, వేపమండల్ని హారాలుగాకట్టి, మెడలో వేసుకుని, చేతులో కొన్నిమండలుపట్టుకుని, మహంకాళి రూపంలాగ తయారయింది.

ఇంటిలోపల గడియవేసి దొడ్లో నిచ్చెన వేసుకుని గోడదూకి, తన యింటివేపు బయల్దేరింది వేపమండల్ని వూగించు కుంటూ.

ఈలోపున బాగా చీకటిపడింది. దొంగ వెంకయ్య ఏంచేస్తున్నాడు యింతసేపూ? కొత్తపెళ్లాం అడిగిందే చాలునని బజారుకి వెళ్లి ఒక దుకాణంకి పోవడం "చాటలు కావాలి" అని అడగడం, చాటలు యిచ్చిం తరవాత, "గీటలుగూడా యియ్యండి" అంటే, "గీటలేంటి నీమొహం" అని దుకాణంవాళ్లు తన్ని పంపించడం, ఇంకో దుకాణంకి వెళ్లడం, "కొబ్బరికాయ యియ్యండి" అని అడగడం, ఇచ్చిన తరవాత "గిబ్బరికాయకూడా యియ్యండి" అని అంటే, "గిబ్బరికాయ ఏమిటి నీ మొహం" అని తన్ని పంపించడం, యిట్లా ప్రతిదానికీ బాగా తన్నులుతిని, చివరికి దొంగ వెంకయ్య దొరికిన సామానులు మూట కట్టుకుని బయల్దేరేప్పటికి చీకటి పడిపోయింది.

మధ్య దోవలో వాడికి ఎదురుగుండా మిణుక్కు మంటూ ఒక వెలుగూ, ఇటూ అటూ వూగుతూ ఓ నల్లని ఆకారం కన పడింది. "ఓరి బాబో దెయ్యంలాగుంది రోయ్" అని హడిలిపోయి నిలబడి పోయాడు. ఆకారం మెల్లిగా వీడివేపే వొస్తోంది. దగ్గరకి రాగానే, మెరిసే బంగారం నగలూ, మొహాన పెద్ద కుంఖంబొట్టూ అవీచూసి "ఇది దెయ్యంకాదు దేవత రోయ్" అని అనుకుని, "ఇంకేం, నాపంట పండింది. కావల్సినన్ని వరాలడుగుతాను" అని సంతోషించి, సాష్టాంగ నమస్కారం చేశాడు, మహంకాళి వేషంలోవున్న వీరలక్ష్మికి! కాని దొంగ వెంకయ్య వీరలక్ష్మిని ఆవేషంలో గుర్తుపట్టలేదు.

వీరలక్ష్మి, శివంపూనినట్టు యింకా ఇటు అటూ వూగి, భీకర కంఠంతో ఇట్లాఅంది: "ఓరీ, నీభార్య నోముకి కావల్సినవన్నీ తీసుకుని వొచ్చావా?"





"ఓ, తెచ్చాను తల్లీ" అన్నాడు దొంగ వెంకయ్య గజగజ వొణకుతో.

"అవన్నీ నాముందు పెట్టు."

అన్నీ ముందర పెట్టాడు.

"స రే, కాటిక్కాయలున్నాయిగాని, గీటిక్కాయలేవి? పసుపు వుందిగాని, గిసుపుఏదీ?"

"తల్లీ రచ్చించమ్మా, గీటిక్కాయల కోస మడిగితే, గీటిక్కాలేంటిరా, అని చెంప పగలేట్టు కొట్టాడు ఆ దుకాణం ముండాకొడుకు. గి బ్బ రి కా య ల కో స మడిగితేగూడా చెంపకాయలు వేశారు. అందరిచాతా తన్నులుతిని, చివరికి దొరికిన వేవో మూటకట్టుకుని వొస్తున్నాను" అన్నాడు వెంకయ్య.

"తన్ని పంపించారా, పాపం! అవి లేకుండా నోము ఎలాగూ చెయ్యటానికి వీలులేదు. మళ్లీ వెళ్లి ఆ దుకాణంవాళ్లనే అడుగు. నీవు అడిగినవన్నీ యిచ్చేట్టు వరం యిస్తున్నాను. పోయి అవికూడా తీసుకుని త్వరగా రా" అన్నది మహంకాళి.

"నువ్వు తల్చుకుంటే కానిదుందా తల్లీ" అంటూ ఒక్క పరుగున వెళ్లాడు దొంగ వెంకయ్య, తను తెచ్చినవన్నీ అక్కడ వదిలిపెట్టి.

వెంకయ్య అటు పోగానే వీరలక్ష్మి అవస్తువులన్నీ మూట కట్టుకుని అక్కడ్నించి



త్వరగా వెళ్లిపోయింది. దొంగ వెంకయ్య దుకాణాలకిపోయి, గీటిక్కాయలు, గిసుపు, గీటలూ అడిగి మళ్లీ తన్నులుతిని ఏడుస్తూ మహంకాళితో చెప్పుకుందామని వచ్చాడు. వస్తే ఏముందీ, మహంకాళీ లేదూ, తను అక్కడ వదలిపెట్టి వెళ్లిన వస్తువులూ లేవు. "వరం యివ్వకపోగా యింతా కష్టపడి తన్నులుతిని సంపాయించిన వస్తువులు కూడా తీసుకు మాయమైంది. ఇదెక్కడో గడుసు దేవతలాగా వుంది" అని తిట్టుకుంటూ యింటికి చేరుకున్నాడు వెంకయ్య.



ఇంటిముందుకు రాగానే లోపల్నించి చుయ్యి, చుయ్యి మనే శబ్దం వినపడింది. అది వినేప్పటికి పాపం వెంకయ్యకి నోరూరింది. తలుపునెట్టాడు. లోపలగడియ వేసివుంది.

"అమ్మా, తలుపు తియ్యవే. నేను వెళ్ళగా చూసి, నువ్వూ, కొత్త కోడలూ, అప్పచ్చు లొండుకుని తింటున్నారా" అని తలుపు బాదాడు. ఎవరూ పలకలేదు.

"నాకు పెట్టాల్సివొస్తుందేమోనని,తలుపు తియ్యకుండా అన్నీ మీరే మింగుతున్నారా?' అని అరిచాడు. మళ్లీ ఎవరూ పలకలేదు. తలుపు కొట్టీ, కొట్టీ యింక విసిగి తలుపు పగలగొట్టి లోపలికి వెళ్లాడు.

"ఓసి దొంగముండా, తడికచాటున కోడలికి మెక్కపెడుతూ, ఇక్కడే కూచుని పలకనన్నా, పలకలేదేమిటే! కొత్తకోడలిని చూసి అప్పుడే యింత మిడిసిపాటా." అని గోడకి అనుకుని కూచున్న తల్లి మొండాన్ని ఒక్క తన్ను తన్నాడు. ఆ మొండెం ముందరికి దొర్లింది. తన తల్లికి తల లేక పోవడంచూసి గాభరాపడి, పిచ్చివాడిలాగ ఇల్లంతా తిరగటం మొదలు పెట్టాడు. పొయ్యిమీద భయంకరమయిన దృశ్యం కనపడింది. తన తల్లితల దూలానికి కట్టి వుంది. ఒక్కొక్క నెత్తురుబొట్టు బాణలిలో పడినప్పుడల్లా "చుయ్యి చుయ్యి" మనే శబ్దం.

ఇదంతా వీరలక్ష్మి చేసిన మోసమే అని గ్రహించాడు దొంగ వెంకయ్య.

"ఓసి మాయలమారీ, ఎంతటిదానివే! నేనే అనుకుంటే నన్ను మించినదానివి లా గున్నావు. దోవలో కనపడ్డదిగూడా నువ్వే! ఏ దెయ్యమో, దేవతో అని హడలి పోయినాను. చూసుకో, నీపని పట్టిస్తాను" అని తిట్టుకుంటూ దొంగ వెంకయ్య తన ముఠాతో పన్నాగాలు పన్నాడు.

ఇంక వీరలక్ష్మి, తన వూరి పొలిమేర చేరుకుని అక్కడ చెరువులో స్నానంచేసి, తన భయంకర రూపం తీసేసి, యింటికి వెళ్లింది.

"ఇదేమిటే, ఇట్లా వొచ్చావు? ఏం జరిగింది? నీ మొగుడేడీ?" అని ఆత్రంగా అడిగారు ఆమె అక్కలు.

"ఆయన, ముంచుకుపోతున్న వ్యాపహారంమీద, పొరుగూరు వెడుతూ, నీ అట్లతద్ది నోము మీ ఇంట్లోనే చేసుకో అని, యివన్నీ ఇచ్చి నన్ను వూరిబయిటదాకా దిగబెట్టి అదోవనే ఆయన పొరుగూరు వెళ్లి పోయినారు" అని అబద్ధమాడింది వీరలక్ష్మి. ఆమె తెచ్చుకున్న సామానూ, కట్టుకున్న చీరా చూసి, ఎంతో సంతోషించారు ఆమె అక్కలు. పైకి అట్లా అందిగాని లోపల భయంగానే వుంది వీరలక్ష్మికి, ఏ రాత్రి వేళో దొంగ వెంకయ్య తన ముఠాతోసహా వొచ్చి, కసి తీర్చుకుంటాడని.

(ఇంకావుంది)






అనగా అనగా ఒక ఊళ్లో ఒక పిసినిగొట్టు ఉండేవాడు. అతను వడ్డీవ్యాపారం మొదలైనవన్నీ చేసి లక్షలాది ధనం గడించాడు. కాని ఏంలాభం ? ఏ జన్మానా పిల్లికికూడా బిచ్చంవేసిన పాపాన పోలేదు. అందాకా ఎందుకు? తన కడుపుకైనా తినేవాడు కాదు.

ఇట్లా ఉండగా ఒకనాడు ప్రక్కఊళ్లో ఉన్న తన బంధువుల యింట్లో పెండ్లి అనీ, అందుకు బంధుమిత్ర సపరివారంగా రావలసినదనీ, శుభలేఖవచ్చింది.వచ్చిందే తడవుగా మన పిసినిగొట్టు యీ కరువు రోజుల్లో నాలుగురోజులు గడిచినా గడిచిందే ననుకొని పిల్లాణ్ణి, భార్యని, వెంటబెట్టుకొని యింకా పెళ్ళి నాలుగురోజు లుండనగానే ఆవూరికి బయలుదేరాడు. యించుమించు పది, పదిహేను రోజులు దాకా యింటి ముఖం చూడకుండా ఉండే యేర్పాటుతో బయలుదేరాడు కాబట్టి యింట్లోఉన్న డబ్బూదస్కం, నోట్లు, గీట్లు అన్నీతీసుకొని కట్టకట్టి పెట్టెలో పెట్టుకొని, భార్యాపుత్రాదులతో దారిపట్టాడు పిసినిగొట్టు.

బండి ఎక్కితే బాడు గివ్వాలిగదా అని నెత్తిమీద పెట్టె, చంకలో సంచి, భుజం మీద బుడ్డాణ్ణి వేసుకొని భార్య వెంటరాగా బయలుదేరాడు.

పిసినిగొట్టు వెళ్లవలసిన పెళ్లివారి ఊరికీ వీళ్ళ ఊరికీ మధ్య ఉప్పుటేరు ఒకటి అడ్డంగా పారుతోంది. అది వేసవికాలంలో యెంత బక్కచిక్కి ఉంటుందో, వర్షాకాలంలో అంత బాగా బలిసి ఉంటుంది. ఆ ఏటిలో జనాన్ని దాటవెయ్యడానికి

గోకరాజు వెంకట్రాజు, జువ్వలపాలెం.



వో నావ వేసుకొన్నాడు పల్లెపెద్దయ్య. మన పిసినిగొట్టు ఎప్పుడువెళ్లినా దిగే వెళ్లేవాడు గాని కానిడబ్బు యిచ్చి నావమీద దాటిన పాపాన పోలేదు.

పిసినిగొట్టు భార్యా బిడ్డతో ఏటొడ్డుకు చేరుకున్నాడు. వీళ్ళని చూడగానే పల్లె పెద్దయ్యకు ఎక్కడలేని మంటా వచ్చింది. కారణం? అయన ఎప్పుడైనా ఓకాని డబ్బు యిచ్చి దాటితేగా! అడవాళ్ళతో ఉన్నాడు కదా, ఎవరికోసరం యెక్కుతాడనుకొని పావలాయిచ్చి కాలు పెట్టమన్నాడు పడవలో.

"మనిషికి అణాచొప్పునేగదా పుచ్చుకొంటున్నావు? నేనూ అలాగే యిస్తాను" అని పైగా బుడ్డాణ్ణి కొసరన్నాడు పిసినిగొట్టు.

"యీబేరాలు నాకాడచాగవు. ఎల్లవయ్యా, ఎక్కావు! ఆ బేడ డబ్బులు నీకాడే ఉంచుకో. నాలుగు రోజులుపాటు సుట్ట ముక్కకొత్తాది" అని గొణుగుకుంటూ పోయాడు పెద్దయ్య.

సరే! పిసినిగొట్టు మాత్రం తక్కువా యేమిటి? దిగువగా ఉన్న మెరకరేవుకు వెళ్లి యిదివరకు ఉన్న సామాను అలాగే ఉంచుకొని చుట్టుపట్ల ఎవరూ లేకుండా చూచుకొని మరో చంకలో పెళ్లానెత్తుకొని ఏట్లోకి దిగాడు. ఏరు మంచి వడిలో ఉంది. పావలా డబ్బులు పారెయ్యలేని వీరిశెట్టి సగందూరం వెళ్లేసరికి పీకదాకా పీనాసి వెనక్కిపోవడానికి వీల్లేక, ముందుకు సాగడానికి కాళ్ళాడక యింక నట్టేట్లో ఆలోచన మొదలెట్టాడు. బరువైనా భార్యని పదల్లేక

"చెటంటూ ఉంటే కాయలు ఎప్పుడైనా కాస్తుందికదా" అనుకొని బుజంమీదఉన్న బుడ్డాణ్ణి కాస్తా గంగపాలు చేసి కొంత బరువు తగ్గించుకొన్నాడు.

తర్వాత అలాగే మరి కాస్తదూరం వెళ్లేసరికి ఏరు వడి మరీజాస్తీ అయింది. మళ్లీ ఆలోచనలోకి దిగాడు. "డబ్బుంటూ ఉంటే ఎంతమంది పెళ్ళాలైనా సంపాదించవచ్చు" అనుకొని పెళ్ళాన్ని కాస్తా ఏటికొప్పగించాడు.

ఇంక మిగిలింది నెత్తిన పెట్టె, చంకలో డబ్బుసంచి. ఇకదాటవలసినదికూడా అట్టే ఉన్నట్టు కనిపించకపోవడంచేతముందుకు సాగడమే మంచిదనుకున్నాడు. కాని ఏటి వేగం హెచ్చుసాగింది. యీసారి ఆ డబ్బు సంచీ, పెట్టెకూడా బరువే అయినై. "బ్రతికుంటే బలుసాకు తినొచ్చు ముందు ప్రాణాలు చూచుకోవా"లనుకొని గత్యంతరంలేక అడబ్బుసంచి, పెట్టె కాస్తా ఏట్లో జారవిడిచాడు. యింక మిగిలింది వీరిశెట్టి.

భగవంతుడు లేడూ?



పాపలాడబ్బులు యిచ్చి పడవెక్కలేక రెండు ప్రాణాలు ఏటి కొప్పగించిన పిసినిగొట్టును మాత్రం బ్రతకనిస్తాడా భగవంతుడు?

మరి కాస్త దూరం వెళ్లేసరికి అతను ఆయాసంతో మరి యీదలేక తనుకూడా వాళ్ళతోబాటే ఏటి గర్భంలోకి వొరిగాడు.

చూచారూ! తమ్ముళ్లూ! పిసినిగొట్టు పెళ్లి ప్రయాణమేమైందో? పెద్దవాళ్లైన తరువాత మీరుమాత్రం అలా పిసినిగొట్టుల్లా ఉండకండేం.




# అమ్మపులి - నాన్నపులి

అనగా అనగా ఒక అడవిలో అమ్మపులీ నాన్నపులీ వుండేవి. వాటికి మూడుపిల్లలు. మూడవ పిల్ల పుట్టిన కొద్దినెలలకే నాన్న పులికి పెద్దజబ్బు చేసింది. ఒకరోజున తన ముగ్గురు పిల్లల్ని దగ్గరకు పిలిచి నాన్నపులి యిలా చెప్పింది:

"నేను యీ క్షణానో మరుక్షణానో చచ్చి పోతాను. నేను చచ్చిపోయే ముందు మీకు కొన్ని విషయాలు చెప్పాలి. ఇవి మీరు ఎప్పుడూ మరచిపోకూడదు.

"అరణ్య సామ్రాజ్యానికి మనం రాజులం. వీర్య శౌర్యాలకి మనజాతి పుట్టి నిల్లు. ఈ కొననుండి ఆ కొనవరకు యథేచ్ఛగా అరణ్యంలో సంచరిస్తూ, ఇష్టం వచ్చిన జంతువుల్ని వేటాడ్తూ ఉంటాము కాని "మనిషి" అనే మృగం ఒకటి మీకు తెలియనిది వుంది. అది చాలా జిత్తులమారి, శక్తిగలదిని. ఆమనిషిజోలికి మీరెప్పుడూ పోవద్దు. మనిషి చుట్టు ప్రక్కల వున్నాడూ అని మీరు ఎప్పుడైనా గ్రహిస్తే ఆప్రాంతాలనుండి యితర చోట్లకు తొలగిపొండి. ఇదే మీకు నా ఆఖరిసలహా."

ఈమాటలు చెప్తూ నాన్నపులి ప్రాణాలు వదలిపెట్టింది.

చాలా కాలంవరకు నాన్నపులి చెప్పిన సలహాప్రకారం పులిపిల్లలు మూడూ నడుచుకుంటూ వచ్చాయి. వాటికి రోజూ కావలసిన ఆహారంకోసం అడవిపందులు, జింకలు, లేళ్లు మొదలైనవాటిని వేటాడి తినేవి. కాని వినోదంకోసం అయినా మనిషిని వేటాడాలి అనే ఆలోచన అవి మనస్సులోకి రానిచ్చేవికావు. ఆ చుట్టు పట్ల ఎక్కడైనా నరసంచారం వున్నట్లు తెలుస్తే ఆచోటువిడిచి దూరంగా పోయేవి.

పులిపిల్లలు మూటిలోనూ చిన్నదైన తమ్ముడుపులికి మాత్రం తండ్రిచెప్పి పోయిన సలహాలో నమ్మకం రోజు రోజుకి తగ్గిపోవటం ప్రారంభించింది. అన్నపులు లిద్దరికన్నా తమ్ముడు పులికి స్వతంత్రపు

వి. వేణుగోపాల్, మదరాసు.



ఆలోచనా, సాహసమూ ఎక్కువ. కాస్త పెద్దదై కండలు గట్టిపడగానే, తండ్రి ఎంతో భయంకరంగా వర్ణించిన మనిషి-మృగాన్ని వెతికి వేటాడాలన్న ప్రబలమైన కోర్కె తమ్ముడు పులి మనస్సులో కలిగింది. ఈ దురాలోచన మనస్సులో ఎప్పుడైతే ప్రవేశించిందో, ఆ క్షణమే మనిషిని వెతకడానికి అడవి సరిహద్దు ప్రాంత్రాలకి తర్లిపోవాలని తమ్ముడుపులి నిశ్చయించుకుంది.

ఈ సంగతి అన్నపులులు తెలుసుకొని అలా జరగకుండా ఆపాలని తమ్ముడు పులిని అనేక విధాల బుజ్జగిస్తూ బ్రతిమాలినై. చచ్చిపోతూ తండ్రిచెప్పిన ఉపదేశాన్ని జ్ఞాపకంచేశాయి. ఎన్నివిధాల నచ్చచెప్పాలని ప్రయత్నంచేసినా తమ్ముడుపులి 'ససేమిరా నా పట్టును విడవను. మనిషి అంతు నేను తెలుసుకోవాలి' అంది. ఇంక చెప్పేది, చేసేది ఏమీలేక అమ్మపులీ అన్న పులులూ తమ్ముడుపులిని దాని కర్మానికి దాన్ని వొదిలేశాయి.

అంతు తెలుసుకోవాలీ, వేటాడాలీ అన్న యోచనేతప్ప తమ్ముడుపులి 'మనిషి'ని ఎప్పుడూ చూడనేలేదు. అందువల్ల మనిషి



లక్షణాలు ఎలాగైనా ముందుగా తెలుసుకోవాలనుకుంది. వెళ్తూ వెళ్తూ వుండగా కొంతదూరంలో ఒక ముసలి ఎద్దు ఒంటినిండా వాతలు, దెబ్బలు గుర్తులతో, బక్క చిక్కి, పచ్చిక మేస్తూ కనిపించింది. తమ్ముడుపులి దగ్గిరికివెళ్లి "ఇదుగో-ఒక్కసారి తల ఎత్తు. మనిషంటారు. నువ్వేనా?" అని అడిగింది.

"అబ్బే - నేనుకాదు. చావుకి సిద్ధంగా వున్న ఒక ముసలి ఎద్దునినేను. మనిషితో నీకేంపని?" అంది బక్కచిక్కిన ఎద్దు.

"మరేంలేదు. మనిషిని వేటాడి,మాంసం రుచిచూడాలనుంది" అంది తమ్ముడుపులి.





"అమ్మయ్యో! మనిషిని వేటాడటమే. యిటువంటి పిచ్చి పిచ్చి అలోచనల్ని కట్టిపెట్టు. నా స్థితి ఎట్లా వుందో చూడు! దీనికంతటికీ ఎవరు కారణం మను కున్నావ్? మనిషే! నాచేత బాగా చాకీరీ చేయించుకున్నంత కాలం చేయించుకుని నేనుముసలిదానినైపనిపాటలకుపనికిరానని తోచగానే నన్ను యీ అడవిలోకి తోలే శాడు. స్వార్థం, తెలివితో గూడిన బలం కల జంతువు మనిషితప్ప యింకొకటి ఉండబోదు. మనిషిజోలికి పోవద్దని నా సలహా" అంది బక్కచిక్కిన ఎద్దు.



తమ్ముడుపులికి యీ మాటలు వింటే నవ్వువచ్చింది. మరి కొంత దూరం పోగా ఒక ముసలి ఏనుగు చర్మం వెళ్ళంతా వేళ్ళాడుతూ ఒంటరిగా కన్పించింది.

తమ్ముడుపులి ఆగి "మనిషంటారు. నువ్వేనా?" అని ఏనుగును అడిగింది.

ఏనుగు చేటల్లాంటి చెవుల్ని ఆడిస్తూ "అబ్బే! నేను చావుకి సిద్ధంగావున్న ఏను గుని. నీకు మనిషితో ఏం పనో నేను తెలుసుకోవచ్చా?" అంది.

"ఓ, దానికేం...మరేంలేదు. నాకు మనిషిని వేటాడాలని వుత్సాహం. అందు కోసమే బయలుదేరాను." అన్నది తమ్ముడు పులి. ఈ మాటలు విని ఏనుగు తన తొండాన్ని వూపుకుంటూ యిట్లా చెప్పింది.

"మంచిదానివి...నీకు పొయ్యేకాలం వచ్చింది కాబట్టే యిటువంటి దురాలోచన తట్టింది. చాలు చాలు. బ్రతికి బాగుండా లంటే వెనక్కి వెళ్లు. చూశావా ఇప్పటి నా స్థితికి మనిషే కారణం. నేనూ వయస్సులో మదించి, నా అంత బల వంతులూ, నన్ను ఎదిరించగల వాళ్ళూ ఎవ్వరూ లేరని విర్రవీగేదాన్ని. అరణ్యం అంతా విచ్చలవిడిగా సంచరించేదాన్ని. కాని ఏం లాభం. నువ్వు వెదకి వేటాడా లనుకుంటున్న మనిషే నన్ను గోతులో దించాడు. మచ్చిక చేశాడు. నావల్ల తనకు





అనుకూలమైన పనులన్నీ చేయించుకునే వాడు. నాలో ఓపిక ఉన్నంత కాలం నేను తిన్నంతా యిచ్చేవాడు. నేను ముసలిదానినై పనికిరానని తోచగానే అడవుల్లోకి తోలేశాడు. మనిషికన్న స్వలాభీ, నేర్పరీ యింకొక జంతువు యీ సృష్టిలోనే వుండదు. నామాట విని, నువ్వు యీ ఆలోచన వదలిపెట్టు." అంది.

తమ్ముడుపులికి ముసలి ఏనుగు చెప్పింది ఏమీ నచ్చలా. పైగా ఒక్క చిక్కన ఎద్దూ, ముసలి ఏనుగూ చెప్పిన సంగతులు విన్న తర్వాత మనిషిని వేటాడాలన్న కోరిక మరింత ఎక్కువైంది.

కొంతదూరం వెళ్లగా దూరాన రంపంతో చెట్లని కోస్తున్న శబ్దం వినపడింది. ఆ శబ్దం విని, ఆ వైపుకే అడుగులో అడుగు వేసుకుంటూ తమ్ముడుపులి నడిచింది. అక్కడ ఒక పెద్ద చెట్టుని రంపంతో కోస్తూ ఒక కట్టెలుకొట్టేవాడు కనిపించాడు. తమ్ముడుపులి అతనిదగ్గరకువెళ్లి అతనివైపు ఎగాదిగా చూచి "కాస్త పని కట్టిపెట్టి నా మాటకు జవాబుచెప్పు. మనిషంటారు, నువ్వేనే?" అంది.

ఆ కట్టెలు కొట్టే మనిషి, రంపాన్ని నిలిపి, తమ్ముడుపులివైపు తిరిగి "ఆఁ నేనే మనిషంటే. నాతో నీకేంపని?" అన్నాడు.



ఈ మాటలు వినేసరికి తమ్ముడుపులికి చెప్పలేనంత సంతోషం కలిగింది, ఇన్ని రోజులకి తను వెతుకుతున్న మనిషి జంతువు కనిపించాడని.

"నీకోసమే వెతుకుతున్నాను. నిన్ను చంపి, నీ మాంసం తినాలి" అంది.

"పాపం అట్లాగా. నువ్వు వెర్రి పిచ్చిదానివిలాగా వున్నావే. ఒక పులిచేత చచ్చేటంత బలహీనుడనుకున్నావా మనిషంటే!" అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

తమ్ముడుపులి పెద్దపెట్టుగా నవ్వి "నిన్ను చూస్తేనే తెలుస్తోంది, ఎంత బలవంతుడివో" అంది.



"నా బలాన్ని గురించి నీకింకా ఏమీ తెలియదన్నమాట. అలాగైతే నా వెంటరా, చూపిస్తాను" అన్నాడు ఆ మనిషి.

తమ్ముడుపులి సరేనని అతని వెంట నడవసాగింది. కొంత దూరాన కొయ్యదుంగలతో కట్టబడిన చిన్న యింటిని చూపిస్తూ ఆ మనిషి "అదిచూశావా! దాన్ని యిల్లు అంటారు. నేను కట్టాను. అందులో వుంటే ఎండ, వాన, చలి నన్ను ఏమీ చెయ్యలేవు. మీ సంగతి, అలా కాదు. అటువంటి యిల్లుకట్టుకొని ఎండని, వానని, చలిని ఎదిరించలేనప్పుడు మీకు ఎంత బలంవుండి ఏమి లాభం!" అంటూనే యింట్లోకి వెళ్లి తలుపు లోపల ఘడియ వేసుకున్నాడు.

మనిషి చెప్పిన మాటలు వినేసరికి తమ్ముడుపులికి తగని కోపంవచ్చింది. ఆ కోపం పట్టలేక యిట్లా అంది. "నేను యీ అరణ్యానికల్లా రాజుని. నాకన్న బలవంతులు ఎవరూ వుండరు. నా శరీరం ఎంత అందంగా వుందో చూడు! ఇంత అందం, బలం కలిగిన నేనే ఆ యింట్లో ఉండాలి. నేను వుంటేనే ఆ యింటికి శోభ. నీవంటి బలహీనపు జంతువ ఆ యింట్లో వుండకూడదు. నువ్వుబయటికివచ్చి యిల్లు నాకు అప్పచెప్పకపోతే చూసుకో ఏమి చేస్తానో" అని గర్జించింది తమ్ముడుపులి.

అప్పుడు ఆ కట్టెలు కొట్టేవాడు తలుపు తెరుచుకొని బయటికివచ్చి "నువ్వు చెప్పినదంతా నిజం... ఈ యింట్లో నువ్వే వుండటానికి తగినదానివి" అన్నాడు.

తమ్ముడుపులి వెంటనేయింట్లో ప్రవేశించి అరణ్యం అంతా ప్రతిధ్వనించేలాగు బిగ్గరిగా గర్జించింది. కట్టెలు కొట్టే మనిషి తలుపుకు బైటగొళ్లెంబెట్టి తన దారిని తాను వెళ్లిపోయాడు.

పాపం, తమ్ముడుపులి ఏం చేస్తుంది? బైటికి రాలేక అందులోనే వుండిపోయింది. అలా తిండీ నీళ్లూలేకుండా నాలుగురోజులు వుండి అందులోనే చనిపోయింది.



# యజమానికి తగ్గ నౌకరు

ఒక వూళ్లో భీమయ్య అనే ఒక వర్తకుడుండే వాడు. అతను తానింత తిని ఒకరికింత పెట్టి ఎరుగడు. అతనంటే ఎవ్వరికీ గిట్టదు. ఆ వూళ్లోకంతా అతనిదే పెద్ద కొట్టు. ఆ కొట్టు కంతటికీ ఒక్కడే నౌకరును వుంచుకుని వ్యాపారం చేసేవాడు. కొట్టుకి కావలసిన సామానులు తెచ్చుకోవాలంటే పక్క గ్రామానికి వెళ్ళవలసి వుండేది. ఆ గ్రామానికి వెళ్లే దారిలో ఒక చిట్టడివి కూడా వుంది. అడవిగుండా పోవాలంటే దొంగల భయం ఎక్కువ. అందుచేత భీమయ్య కొట్టుకి కావలసిన సామగ్రి కొనుక్కోవాలనుకున్నప్పుడు తన నౌకరునుకూడా వెంట తీసుకుని వెళ్లేవాడు. పగటిపూట దొంగల భయం వుండదుకాబట్టి ఎప్పుడు వెళ్ళినా పగటిపూటే వెళ్ళి పనులు ముగించుకుని సాయంత్రానికల్లా యింటికి తిరిగి వచ్చేవాడు.

ఒకరోజు భీమయ్య తొందర పనుల మీద ప్రక్క గ్రామానికి పోవాల్సి వచ్చింది. కొట్టు మూసేసరికే మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటిపోయింది. ఎలాగైనా ఆరోజు వెళ్ళక తప్పదు. నౌకరును వెంటబెట్టుకుని చరచరమని నడిచి వెళ్ళుతున్నాడు.

వూరుదాటి అడివిదారి బట్టేసరికి ప్రొద్దు గూకి పోయింది కూడాను. ఒకరి మొహం యింకొకరికి కనిపించనంత చీకటి. ఇంకేం! భీమయ్యకు చీకట్లో ప్రయాణం సాగించడం అసలే అలవాటులేదు. బిక్క మొహం వేసుకుని నౌకరుతో "అబ్బాయీ! ఎలాగో చీకటికూడా పడింది. ఇకపైన నడిచి వెళ్లడమనేది ఇప్పట్లో జరిగే పనికాదు

సి. ఆర్. చంద్రరావు, గుంటూరు.

ఇప్పుడు తిరిగి ఇంటికి పోవటమూ అంత మంచిపనికాదు. నాదగ్గిర వెయ్యి రూపా యిలదాకా డబ్బుంది. ఈ అడవిలో దొంగల భయం ఎక్కువట! నేను ఆ మూల ఒక పొద మరుగున దాక్కుని పడుకుంటాను. నువ్వుమాత్రం ఈ రస్తామీదే తెల్లవారేదాకా మేలుకొని పడుకో. తెల్లవారగానే యిద్దరం బయలుదేరి పోదాం," అని చెప్పి పైకొంగు లోనించి ఒక పావలాబిళ్లతీసి నౌకరు చేతులో పెట్టాడు. నోరుతెరిచి అడిగితేనే కానిడబ్బు యిచ్చేవాడు కాడు. అలాంటిది యిప్పుడు అడగకుండానె పావలాకాసు యిచ్చేసరికి నౌకరు లోలోపల మురిసిపోయాడు. చీకట్లో తెల్లనాణెం తళ తళా మెరిసిపోతోంది. సరేనని నౌకరు దారి కడ్డంగా పడుకుని నిద్రపోయాడు. భీమయ్య అటువైపు పొదలచాటున పడుకుని దిక్కులు చూస్తున్నాడు.

ఇంతలో ఆ దారిన దొంగల చప్పుడు వినిపించింది. దారికి అడ్డంగా పడుకున్న నౌకరు చప్పున కళ్ళు మూసుకున్నాడు. దొంగలు చీకట్లో ఒకరి వెంబడి ఒకరు వెళ్ళుతూ నౌకరుమీద అడుగు వేశారు. అయినా నౌకరు కదలక మెదలక పడుకునే వున్నాడు. అందులో ఒకదొంగ "ఒరేయ్! యిదేమిటో పెద్ద కొయ్యమొద్దులాగుంది, అవతలికి లాగండ్రా" అని కేకవేశాడు.

నౌకరుకు భయంవేసి "నేను కొయ్య మొద్దూ కాదు, గియ్యమొద్దూ కాదు-ఇదుగో చూడండి, నాదగ్గిర పావలాబిళ్ల వుంది - నేను నిజంగా మనిషినే" అని పడుకునే చెప్పాడు.

ఇది వినేసరికి దొంగలంతా పోగై చీకట్లో నౌకరును తన్ని ఆ పావలాబిళ్ళ కాస్తా కాజేశారు. నౌకరుకు కాళ్ళు వణికిపోయి "నన్ను కొడితే మీకేం లాభం? అదుగో ఆ పొదలచాటున పడుకున్నాయనను కొట్టినా బోలెడంత డబ్బొస్తుంది" అన్నాడు.

వెంటనే దొంగలు నౌకరును వదిలిపెట్టి పొదలచాటున దాక్కున్న భీమయ్యను పట్టుకుని చావబాది అతని దగ్గరున్న



డబ్బంతా గుంజుకుని వెళ్ళిపోయారు. భీమయ్య దెబ్బలకు తాళలేక కుయ్యో మొర్రో మంటూ రస్తావేపుకు వచ్చాడు. అక్కడే వున్న నౌకరు భీమయ్యను ఓదారుస్తూ వీపుపైన దుమ్మంతా దులిపాడు.

భీమయ్యకు నౌకరుమీద పట్టలేనంత కోపంవచ్చి, "ఒరేయ్! నువ్వు చచ్చేవాడివి చావక నా సంగతి ఎందుకు చెప్పావురా?" అని అడిగాడు.

"బలే బాగానేవుంది మీన్యాయం! అంతా నేనే తిని మీరుమాత్రం వూరికే వుండటం ధర్మమా! అందుకని మీకూ కాస్త వడ్డించమన్నాను. డబ్బుపోతే పీడాపోయింది. ఇక మనం ఇంటికి వెళ్లేమార్గం చూడండి బాబూ" అని బ్రతిమాలాడు.

భీమయ్యకు వేరే మార్గం లేక కాళ్లు ఈడ్చుకుంటూ నౌకరుతో యింటిదారి పట్టాడు. తన యజమాని పిసినిగొట్టు తనానికి తగినశాస్తి జరిగిందని నౌకరు ఊళ్లోవాళ్ళందరితో ఈ సంగతి చెప్పి భీమయ్యను చాలా అవమాన పరిచాడు.





# చెవిటి

ఒక ఊళ్ళో ఒక గొల్లవా డుండేవాడు. వాడికి పుట్టెడు చెవుడు. ఒకనాడు వాడు అడవిలో గొర్రెలు కాస్తూండగా ఇంటికి వెళ్ళవలిసి వచ్చింది. తాను ఇంటికివెళితే మంద నెవరుచూస్తారు?

ఇంతలో ఒక మర్రిచెట్టుమీద ఆకులు కోస్తూ ఒకబ్రాహ్మడు గొల్లవాడికి కనిపించాడు. గొల్లవాడికి ప్రాణం లేచివచ్చింది.

"ఇదుగో, బాపనయ్యా! నే నింటికి పోయి ఇప్పుడే వస్తాను. నేనొచ్చేదాకా నామందని చూస్తుంటివా, నీకో కుంటి మేక నిచ్చుకుంటాను." అని బ్రాహ్మడిని కేకపెట్టి గొల్లవా డింటికివెళ్ళాడు.

అయితే గొల్లవాడి కేక బ్రాహ్మడు వింటేగా? గొల్లవాడికి పుట్టెడు చెవుడయితే, బ్రాహ్మడికి రెండుపుట్లు చెవుడు.

మళ్ళీ గొల్లవాడు తిరిగివచ్చే సమయానికి బ్రాహ్మడు ఆకులు కోసుకుని మర్రిచెట్టు దిగివస్తున్నాడు. గొల్లవాడు తన మంద అంతా ఉండటంచూసి సంతోషించి, అన్న ప్రకారం ఒకకుంటిమేకను తీసుకుని, 'ఇదుగో, బాపనయ్యా! నేనిస్తానన్న ప్రకారం కుంటిమేక నిచ్చేస్తున్నాను. పట్టుకెళ్ళు,'' అన్నాడు.

గొల్లవాడు కుంటిమేకను తెచ్చి తన మొహంమీద పెట్టటంచూసి బ్రాహ్మడు, "నీ మేకగొడవ నాకేం తెలీదు, ఫో!" అని కసిరాడు.

"అయ్యో బాబో! నీకు కుంటిమేక నిస్తానని మొదటే చెప్పాను. నేనేం అడి తప్పేవాణ్ణిగాను. ఇదుగో కుంటిమేక!" అని గొల్లవాడు దాని కుంటికాలు బ్రాహ్మడికి చూపించాడు.

"ఇది మరీబాగుంది! నేనెక్కడో చెట్టుమీద ఉన్నవాణ్ణి. నీ మేకకాలు నేనెట్లా విరగ్గొడతాను?" అన్నాడు బ్రాహ్మడు.

బ్రాహ్మడిమాటలు గొల్లవాడికీ గొల్లవాడి మాటలు బ్రాహ్మడికితెలియులేదు. బ్రాహ్మడు

దొడ్డి నూకరాజు, పెద్దాపురం – వెలగా శివరామసుబ్బయ్య, నిడుప్రోలు.

# మేళం



చాలా ఆశాపాతకుడై మంచిమేక నిమ్మంటున్నా డనుకున్నాడు గొల్లవాడు. మేక కాలు తానే విరగ్గొట్టాడని గొల్లవాడంటున్నట్టు బ్రాహ్మడికి అనుమానం. ఇద్దరూ వాదనలోకి దిగారు.

"కావలిస్తే ఈ కుంటిమేకను పట్టుకెళ్లు, మంచి మేకను చచ్చినా ఇవ్వను!" అని గొల్లవాడూ, "నువు నూరుచెప్పు, లక్ష చెప్పు, నీ మేకకాలు నేను విరగ్గొట్టలేదు." అని బ్రాహ్మడూ తగాదా పడుతూ మునసబుగా రింటివేపు వెళ్ళారు.

మునసబుగా రింటోకూడా ఆ నాడు చాలా అల్లరిగా ఉంది. ఆయన పొద్దునలేచి పెళ్ళాంతో పోట్లాడి ఆమెను ఛడామడా తిట్టి అన్నం తిననని భీష్మించుకునివచ్చి వీధి అరుగుమీద కూచున్నాడు.

సరిగ్గా యిదే సమయానికి గొల్లవాడూ బ్రాహ్మడూ ఆయన దగ్గిరికి వెళ్ళారు.

"చూడండి, మునసబుగారూ! ఈ బ్రాహ్మడి కామాత్రం న్యాయం ఉండక్కర్లా?" అని గొల్లవాడు తన కథ అంతా చెప్పాడు.

మునసబుగారు మొహం మటమట లాడ్చుకుంటూ గొల్లవాడు చెప్పినదంతా విని బ్రాహ్మడికేసి చూశాడు.

తనమీద గొల్లవాడు లేనిపోని ఫిర్యాదు చేసి ఆయనకు తనమీద కోపంతెప్పించాడని అనుమానంవేసి బ్రాహ్మడు పొద్దున్నే తను లేచినది లగాయితు జరిగిందంతా జాలిగొలిపేటట్టుగా చెప్పాడు.

కాని ఇదంతా ఎవరువిన్నారూ? గొల్లవాడికి పుట్టీ, బ్రాహ్మడికి రెండుపుట్లు చెవుడయితే మునసబుకి మూడుపుట్లు చెవుడు!

అంతావిని ఆఖరుకు "మీరు వెయ్యి చెప్పండి, లక్షచెప్పండి, నేనుమాత్రం దానిచేతి పచ్చి మంచినీళ్ళు తాగితేవొట్టే," అన్నాడు మునసబు.

బి. రంగాచార్య, తెనాలి – జి. శ్రీరామమూర్తి, గుంటూరు.

# వాతాపి -



పూర్వం వాతాపి, ఇల్వలుడు అని యిద్దరు రాక్షసులు వుండేవారు. వీళ్లిద్దరూ అన్నదమ్ములు. పెద్దవాడు ఇల్వలుడు, చిన్నవాడు వాతాపి.

వీళ్లు దారిన పొయ్యే బాటసారులను మోసగించి జీవించేవారు. వాళ్ళు మోసగించే విధంకూడా చాలా గమ్మత్తుగా వుండేది. వాళ్ళ వాకిటిముందుగా ఎవరైనా వస్తున్న అలికిడి అయిందంటే వెంటనే వాతాపి దిట్టంగా బలిసిన పొట్టేలుగా మారిపోయేవాడు. ఇల్వలుడు ఆపొట్టేలును వాకిట్లో కట్టేసేవాడు. ఎవరైనా బాటసారి అటు రాగేనే, "మాంచి పొట్టేలుమాంసంతో భోజనం, బాబయ్యా. చాలా చౌక" అని ఇల్వలుడు అతన్ని పిలిచేవాడు. నిజమే గదా అని బాటసారి ఆశపడి లోపలికి వచ్చేవాడు. ఇల్వలుడు పొట్టేలును నరికి కూర వండి, బాటసారికి కడుపునిండా పెట్టేవాడు. బాటసారికూడా చాలా సంతోషించి తిరిగి తన దారిన వెళ్ళటానికి బయలుదేరేవాడు. ఇంతలో ఇల్వలుడు ముందుగానే వాకిట్లోకి వచ్చి "వాతాపీ, ఒకసారి బైటికిరా" అని కేకవేసేవాడు. ఇల్వలుడు యిలా కేకవెయ్యగానే బాటసారి కడుపులో గబగబ లాడేది. ఉన్నట్లుండి వాతాపి బాటసారి పొట్ట చీల్చుకుని బైటికొచ్చేవాడు. పాపం, బాటసారి చనిపోయేవాడు. వెంటనే అన్నదమ్ము లిద్దరూ చేరి ఆ బాటసారిని చీల్చుకుని తినేవారు. ఇట్లా అమాయకపు బాటసార్లను మోసంచేసి ఆ రాక్షసు లిద్దరూ జీవిస్తుండేవాళ్ళు.

ఇలావుండగా ఒకరోజున అగస్త్య మహాముని ఆ దారిన పోతున్నాడు. అతను అగస్త్యుడని, పాపం మన రాక్షసులకు తెలియదు. అందరిలాగే యితనూ ఒక బాటసారే ననుకుని వాతాపి వెంటనే

బి. యజ్ఞ. ప్రసాదరెడ్డి, నెల్లూరు.

# - ఇల్వలుడు



పొట్టేలుగా మారిపోయాడు. అందర్నీ పిల్చినట్లే అతన్నీ ఇల్వలుడు లోపలికిపిలిచాడు.

అగస్త్యుడు లోపలికి వచ్చాడు. ఇల్వలుడు ఎప్పటిలాగానే పొట్టేలు రూపంలో వున్న వాతాపిని సరికి కమ్మగా కూరవండి పెట్టాడు. అగస్త్యుడుకూడా కడుపునిండా తిని బయలుదేరబోయాడు.

ఇంతలో కడుపులో గ బ గ బ లా డు తున్నట్లు అగస్త్యుడికి తోచింది. మహాముని గదా! అందుచేత తన దివ్యదృష్టివల్ల కడుపులో వాతాపి వున్నట్లూ, యిదంతా ఆ రాక్షసులు తనని చేసిన మోసమనీ అగస్త్యుడు తెలుసుకున్నాడు. అంతేగాకుండా ఇల్వలుడు 'వాతాపీ, ఒకసారి బైటికిరా' అని కేక వెయ్యబోతున్నాడని కూడా అగస్త్యుడు గ్రహించాడు. అందుకని వెంటనే అగస్త్యుడు తన పొట్టమీద చేతితో రాచుకుంటూ, "వాతాపీ, జీర్ణం"అన్నాడు. అగస్త్యుడీమాటలు అనగానే లోపలవున్న వాతాపి, పాపం, లోపలివాడు లోపలే జీర్ణించిపోయాడు.

పాపం తమ్ముడు కాస్తా అగస్త్యుడి కడుపులో జీర్ణించిపోయిన సంగతి ఇల్వలుడి కేం తెలుసు? అందుకని ఇల్వలుడు మామూలుగా "వాతాపీ ఒకసారి బైటికిరా" అని కేకవేశాడు. కాని వాతాపి రాలేదు. మళ్ళీ కేకవేశాడు. ఊహుఁ, రాలేదు. "ఏమిటా సంగతి" అని ఆలోచించసాగాడు.

అప్పుడు అగస్త్యుడు తను "వాతాపీ జీర్ణం" అని పొట్టమీద రాచుకున్న సంగతి బైటబెట్టి తనదారిన వెళ్లిపోయాడు.

తను యితరులను మోసంచెయ్యదలుచుకున్నందుకు తనకే మోసం జరిగిందిగదా అని ఇల్వలుడు చాల విచారించాడు. అంతటితో కథ కంచికివెళ్లింది, మన మింటికి వచ్చాం.




పూర్వం బొమ్రయపాలెమనే గ్రామంలో పేరిశాస్త్రులనే బ్రాహ్మడొక డుండేవాడు. అతని కో గయ్యాళిభార్య ఉంది. ఆమె పేరు పేరమ్మ. శాస్త్రులుగారు తన సంపాదనంతా తెచ్చి ఆమె చేతుల్లో పోస్తాడు. జమా, ఖర్చు లన్నీ ఆమె చేతులమీదనే సాగుతాయి. తన పుట్టింటితరఫు వారెవరయినా వచ్చారంటే వాళ్లకు నెలలపర్యంతము దోచి పెట్టుతుంది. తన భర్తతరఫు వారెవరయినా వస్తే పాపము, వాళ్లని పట్టుమని పదిగంట లయినా నిలుపనివ్వదు. వచ్చిన మరునటి రోజునే వాళ్లని ఏదో ఒక అవమానంచేసి పంపుతుంది. ఇప్పటికి ఆమె తన తల్లిని రప్పించుకొని రెణ్ణెలలయినా కావస్తోంది. ఇంకా తన తల్లికి ఇంట్లోదంతా దోచి పెట్టుతూనే ఉంది. శాస్త్రులుగారికి ఇదంతా నచ్చదు. కాని భార్యనోటికి దడిసి ఏమీ అనేవాడుకాదు. ఏమయినా అంటే తనని ప్రాణంతో నిలవనివ్వదని అతనికి తెలుసు. కాని, మన శాస్త్రులుగారు పైకి ఎంత అమాయకుడో, లోపల అంత యుక్తిపరుడు. ఏపనయినా దూరం ఆలోచించి చేస్తాడు.

పేరిశాస్త్రులు గారికి ఒక తోబుట్టువుంది. ఆమె చాలా సాత్వికురాలు. బొమ్రయపాలెంకు నాలుగు మైళ్లదూరంలో నివసిస్తోంది. ఆమె పేరు నరసమ్మ. ఆమె చాల బీద కుటుంబీకురాలు. ఆమెభర్త భూస్వాముల పొలములను కవులుకు చేసుకుంటూ ఉంటాడు. నరసమ్మ ఎంత పేదరికములో ఉన్నా తన అన్నగార్ని ఏమీ సహాయము చేయమని అడిగేదికాదు. అన్నగారు ఎంత ధనవంతుడైనా భార్యచేతులోవాడని తెల్సు.

నరసమ్మ కుటుంబము రాను రాను దారిద్ర్యస్థితిలో పడజొచ్చింది. ఆ ఏడు పంటలేమీ పండకపోవటంచేత ఆమె భర్త చాలా యిబ్బందిపడుతున్నాడు. తినటానికి తిండి దొరకటంకూడా కష్టమయింది. ఇక ఎట్లాగూ తన అన్నగారి సహాయమడగక తప్పిందికాదు. అందువల్ల అన్నగారిని ఏమయినా సహాయం చేయమని, వదిన

నగురుపల్లి శ్రీరాములు పాత్రుడు, బెజవాడ.

గారికి తెలీకుండా అడుగుదామని, బొర్రయ పాలెం ప్రయాణమయింది. పాపమామె దురదృష్టమో ఏమో ఆరోజునే శాస్త్రులు గారు ఏదో పనిమీద పొరుగూరు వెళ్లాడు.

నరసమ్మ అన్నగారింటికి వెళ్లేసరికి, తన వదినెగారు, ఆమె తల్లీ ఇంట్లో ఉన్నారు. ఈమెను గుమ్మంలో చూడగానే తల్లీ కూతుళ్ళిద్దరూ, అప్పుడే సూటిపోటీ మాటలు అనడము మొదలుపెట్టారు. నరసమ్మ ఆమాటలు లక్ష్యపెట్టక ఇంట్లోకి వెళ్లి, "వదినా, అన్నయ్యేడీ?" అని పేరమ్మను అడిగింది. దానికి పేరమ్మ, "నీవు వస్తావని మీఅన్నయ్య కలగనలేదు. 'అన్నయ్యా' అంటూ ఏదో మూటగట్టు కొచ్చావు పాపము! మీ అన్నయ్యలేదు" అన్నది. నాలుగుమైళ్ల దూరము ఎవరి కొరకైతే తను నడిచివచ్చిందో, ఆ అన్నయ్య లేడనగానే నరసమ్మ నిలువున కృంగి పోయింది. పైగా రెండు రోజులనించీ తిండి కూడా లేదేమో, "వదినా మొన్నతిన్న మెతుకులు......ఇంత అన్నముంటే పెట్తావూ?" అని నోరుతెరిచి పేరమ్మను అడిగింది. దానికి పేరమ్మ నూరుసార్లు తిట్టి, చిన్న రాతిచిప్పలో పాచిపోయిన అన్నము పెట్టింది. నరసమ్మ ఆకలితో మాడులూండటముచేత అన్నము పాచి వాసనవేస్తున్నా తినేసింది. పాపమామెకు ఆ అన్నము చాలలేదు. మళ్లీ అడిగితే తన



వదినెగారు ఇంకెన్ని తిడుతుందో అని అంతటితోటే సరిపెట్టుకుంది.

నాలుగుమైళ్ల దూరము నడిచివచ్చింది కాబట్టి ఆమెకు నిద్రవస్తోంది. అందువల్ల "వదినా, నిద్రవస్తోంది ఒక చింకిచాప ఉంటే పారెయ్యి. ఇలా చేరగిలపడతాను" అన్నది నరసమ్మ. "ఇప్పుడే గిన్నెడు అన్నం తిన్నావోలేదో అప్పుడేనిద్రా! ఇక్కడ ఏదో ఉన్నదని తినడానికి వస్తారు రండలు. చాపాలేదూ, గీపాలేదు. అమూలపడుకో" అంటూ పేరమ్మ తన తల్లితో యింట్లోకి పోయింది.

వదినెగారి చేష్టలన్నీ చూస్తున్న నరసమ్మ, తన దౌర్భాగ్యాన్ని తానే తిట్టు



కుని, చీర కొంగు పరుచుకొని ఒక మూల పడుకుంది. ఆమెకు గాఢంగా నిద్రపట్టింది.

గదిలోపల ఆ తల్లీ కూతుళ్లిద్దరూ, నరసమ్మను ఎలాగ బయటకు సాగనంపుదామా అని ఆలోచించుతున్నారు. ఈమె తిరిగి తమ గుమ్మం ఎప్పటికీ ఎక్కకుండా ఉండేటట్లు చేయాలని వారి ఉద్దేశ్యం. నరసమ్మ ఏమి చేస్తోందోనని ఆ తల్లీ, కూతుళ్లిద్దరూ బయటకువచ్చి చూచారు. నరసమ్మ నిద్రపోతోంది ఓమూల. ఒక నాడైనా చమురురాయని ఆమె తలనుండి పేలు గోడమీదకు పాకుతున్నాయి. అది చూచి వాళ్లిద్దరూ విరగబడి నవ్వుకున్నారు. వాళ్లకు ఓ ఉపాయంతట్టింది. వెంటనే ఒక మంగలిని పిలిచి, ఆమె పునిస్త్రీయని



అయినా సందేహించకుండా వాళ్లిద్దరూ నిద్రపోతున్న నరసమ్మను బలవంతంగా పట్టి, ఆమె తల గొరిగించేసారు. ఈ ఘోర అనపమానం భరించలేక పాపం నరసమ్మ దుఃఖంతో తిరిగి యింటికి పోయింది.

ఇదంతా జరిగిన మరుసటిరోజున పేరి శాస్త్రులుగారు వచ్చారు. తనభర్త తన్నేమీ చేయలేడనే ఉద్దేశ్యంతో పేరమ్మ తను చేసిన ఘనకార్యాన్ని భర్తతో గర్వంగా చెప్పింది. అదంతావిన్న శాస్త్రులుగారికి కడుపు మండిపోయింది.

తనచెల్లెలుకు జరిగిన అవమానానికి బదులుగా, వారిద్దరికీ ప్రతిక్రియ చేయాలనుకున్నాడు. ఏమిచేద్దామా అని దీర్ఘంగా ఆలోచించసాగాడు.

ఇదిజరిగిన కొంతకాలానికి పేరమ్మతల్లి తన భర్తవద్దకు వెళ్లిపోయింది. సమయం కోసం ఎదురుచూస్తున్న శాస్త్రులుగారు సంతోషించాడు. ఏదో పనిఉందని భార్యతో చెప్పి, శాస్త్రులుగారు బయటకు వెళ్లాడు. అక్కడక్కడ ఒకరోజుగడిపి ఇంటికివచ్చి, లేనివిచారాన్ని నటిస్తూ, కూర్చున్నాడు.

ఇంతలో పేరమ్మవచ్చి, "ఏమండీ అలాఉన్నారు?" అని అడిగింది.

దానికి శాస్త్రులు "అబ్బా, ఏమనిచెప్పనే! నేను వెళ్లడము తిన్నగా మీ అమ్మదగ్గరకు వెళ్లాను. ఇక్కడనుంచి ఆమె వెళ్లిన లగాయతు చాలా ఇబ్బందులలో ఉన్నది.





తిండికికూడా కష్టంగావుందట. నిన్నేమైనా సహాయము చేయమన్నది." అని నిజంగా తను వెళ్లి వచ్చినట్లుగానే చెప్పాడు.

ఆ మాటలువిన్న పేరమ్మ ఏడుస్తూ, గబ గబా ఇంట్లోకెళ్లి, నాలుగు పట్టుచీరెలు, ముప్పై రూపాయలు తీసుకొచ్చి" నేనిచ్చానని చెప్పి ఇవి మాఅమ్మకు ఇచ్చి రండి. త్వరగావెళ్లండి" అని అప్పటి కప్పుడే భర్తను తల్లివద్దకు ప్రయాణం చేసి పంపింది.

తనతల్లికి ఇవ్వమని భార్యఇచ్చినది అంతా పుచ్చుకొని శాస్త్రి తిన్నగా తనచెల్లెలు వద్దకువెళ్లి, ఆ పట్టుబట్టలు, ముప్పై రూపాయిలు ఆమెకిచ్చి, వాళ్లను అవమానించటానికి తాను వేసుకొన్న ప్లాన్ అంతాచెప్పి, క్షమార్పణ వేడుకున్నాడు. నరసమ్మ అన్నగారి యుక్తికి సంతోషించింది.

శాస్త్రులుగారు ఇంటికివచ్చి భార్యతో "నీ తల్లికి నీవు పంపినదంతా ఇచ్చాను. ఆమె చాలా సంతోషించింది" అని చెప్పాడు.

కొంతకాలము జరిగాక శాస్త్రులు మళ్లా యిదేఎత్తువేసి, కొంతడబ్బు, కొన్నిబట్టలు అవీ తన చెల్లెలుకు చేర్చాడు. అన్నగారికి తనమీద ఉన్న ప్రేమకు నరసమ్మ దంపతులు చాలా సంతోషించారు. ఈ



విధంగా కొంతకాలము జరిగింది.

పేరిశాస్త్రుల్లు ఈదఫా అత్తగార్కి, భార్యకుఅవమానంచేయాలని ఉద్దేశ్యంతో, భార్యతోచెప్పి, అత్తవారింటికి నిజంగా ప్రయాణమయ్యాడు. వెళ్లి అత్తగారితో ఈవిధంగా చెప్పాడు: "అత్తా, అత్తా! ఇంకేముంది? నాకొంప మునిగిపోయింది. మీ అమ్మాయికి ఈ మధ్య పెద్ద జబ్బు చేసింది. ఎన్నిమందు లిప్పించినా పోలేదు. కొందరు ఇది గాలిసంబంధమని చెప్పారు. వెంటనే భూతవైద్యుల్ని పిలిపించి చూపించాను. వాళ్లు ఈ జబ్బు కుదరడం చాలాకష్టమన్నారు. ఎట్లా నయమవుతుందో



చెప్పమని వారిని కాళ్లా, వేళ్లాబడి బ్రతిమిలాడాను. దానికి వాళ్లు "నవమాసములూ మోసి ఈమెను కన్నతల్లి, తన తల గొరిగించుకుని, పేడనీళ్లు ఈమె మొఖాన్న చల్లి, చీపిరితో బాదుతూ 'నా కూతుర్ని వదలిపోతావా పోవా?' అని, తన కూతుర్ని చావబాదాలి. ఆమె ఎంతగట్టిగా కూతురుని కొడితే, ఆమెను పట్టిన దెయ్యం అంత త్వరగా వదిలి పారిపోతుంది' అని భూతవైద్యులు చెప్పారత్తా!" అని విచారము నటిస్తూ అన్నాడు.

దెయ్యాలమీద, దేవర్లమీదనమ్మకమున్న అత్తగారు ఇదంతా నిజమేనని నమ్మింది. వెంటనే కూతురి దగ్గరకు ప్రయాణం అయింది. అప్పుడు శాస్త్రి "నీకూతుర్ని నేనే ఇక్కడకు తీసుకొనివస్తాను. నీవు రానవసరంలేదు. మేము వచ్చేసరికి నీవు తలగొరిగించుకుని నేను చెప్పినటుగా తయారై ఉండు." అని నేరుగాభార్యవద్దకు వచ్చేసాడు.

పేరమ్మ తన తల్లిక్షేమములు ఎట్లావున్నాయని భర్తనడిగింది. వెంటనే శాస్త్రులు విచారంతో ఈవిధంగా చెప్పాడు. "ఇంకేముందే! మనకొంప మునిగింది! మీ అమ్మకు గాలిసోకిందట. ఎన్ని మందులిచ్చినా పోలేదట. భూతవైద్యుల్ని పిలిపించి చూపించాను. ఆమె కడుపునపుట్టిన కుమార్తె తల గొరిగించుకుని, చీపిరితో 'నాతల్లిని వదలిపోతావా, పోవా?' అని గొడ్డును బాదినట్లు, మీ అమ్మను బాదాలట. ఏమాత్రమయినా జాలిపడకూడదట. ఆదెబ్బలు పడలేక దెయ్యం పారిపోతుంది అని భూతవైద్యులు చెప్పారు. లేకపోతే మీ అమ్మ ఇక దక్కదట" అన్నాడు.

పేరమ్మ అది అంతా నిజమేనని నమ్మి, గుండెలు బాదుకుంటూ, మంగలిని పిలిపించి తల గొరిగించుకుంది. అప్పటికప్పుడు భర్తతో ప్రయాణమయింది.

శాస్త్రులుగారు భార్యను అత్తవారింటివద్ద దింపాడు. అత్తగారుకూడా తయారుగానే వుందిగదా! కూతురు బండిదిగి ఇంట్లో అడుగుపెట్టిందోలేదో, అప్పుడే తల్లి నున్నటి గుండుతో ఎదురై, కూతుర్ని చీపిరితో






బాదుతూ, పేడనీళ్ళు మెఖాన కొట్టటం మొదలెట్టింది. ఇక పేరమ్మ తన తల్లి చేష్టలు చూచి, భర్త చెప్పిందంతా నిజమే అనుకొన్నది. వెంటనే బండిలోవున్న చీపిరి తీసి తనుకూడా తల్లిని బాదడం మొదలు పెట్టింది. రాను, రాను వాళ్లిద్దరిమధ్యా ప్రచండయుద్ధం జరిగింది. చర్మంపూడి రక్తం కారుతున్నా ఆగకుండా, కొట్టుకుంటున్నారు. ఈఘోర్సు అంతా చూచి శాస్త్రులు విరగబడి నవ్వుతున్నాడు.

ఇరుగు, పొరుగు జనము అంతా అక్కడ గుమిగూడేరు. తల్లీకూతుళ్లమధ్య ఎందుకు ఇంత యుద్ధమొచ్చిందో ఎవరికీ అర్థం కాలేదు. "నాతల్లిని వదిలిపోతావా, పోవా?" అని కూతురూ, "నాకూతురుని వదలి పోతావా, పోవా?" అని తల్లీ బాదుకుంటున్నారు. పాపము వాళ్ల శరీరమంతా రక్తమయమే. శాస్త్రులు విరగబడి నవ్వుతూ, చూస్తున్నాడేగాని, విడిపించలేదు. ఇక ఆ తల్లీ, కూతుళ్లిద్దరూ అలిసిపోయి, ఆలోచన్లో పడ్డారు.

అసలువిషయంఎంతకాలందాగుతుంది. బండారం బయటపడి పోయింది. తల్లీ కూతుళ్లిద్దరూ అంతాతెల్సుకున్నారు. ఇక వాళ్లకోపానికి అంతులేకుండా పోయింది శాస్త్రుల్ని నమిలి మ్రింగేద్దామా అనిపించింది. "నీకేం పోయేకాలంవచ్చిండి ! మమ్మలిని ఇలా ఏడిపించావు?" అంటూ వాళ్లిద్దరూ శాస్త్రులుమీద బడ్డారు.

శాస్త్రులు ప్రక్కకు తప్పుకుని గంభీరంగా ఈ విధంగా సమాధానం చెప్పాడు— "అదికాదు ! మీతల్లీ కూతుళ్లిద్దరి నున్నట గుండ్లు చూస్తుంటే, ఆ రోజున మీరు నా చెల్లెలికి గొరిగించిన గుండు గుర్తుకొచ్చి నవ్వుతున్నాను." అన్నాడు. అతని చెల్లెలికి తాముచేసిన అవమానానికి ప్రతీకారంగా, తమని యుక్తిగా ఈ ఘోర అవమానం చేశాడని వాళ్ళు గ్రహించుకుని సిగ్గుపడిపోయారు.

యుక్తికిమించిన శక్తిలేదుకదా! అసలు విషయము తెలుసుకొన్న ఇరుగు, పొరుగు వాళ్లు, అతని యుక్తికి సంతోషించారు.










ఒక అడవిలో ఒక రావిచెట్టు ఒకమైలు రాయి, రెల్లుకలసి పక్క పక్కనే వుంటూ వుండటంవల్ల చాల స్నేహంగా వుండేవి. అవి ప్రతిరోజూ పొద్దున లేవగానే ఒకరి నొకరు కుశలప్రశ్నలు వేసుకొని సంతోషంగా కాలం గడుపుతుండేవి.

ప్రతి కొత్తసంవత్సరం కొత్త ఆకులతో రావిచెట్టు నవనవలాడుతు వుండేది. రెల్లు చాల పొడుగు పెరుగుతూ తెల్లని వెన్ను లతో అందంగా వుండేది. మైలురాయి ప్రతి సంవత్సరం సున్నం పూసుకుని నామము పెట్టుకుని తన పుట్టినరోజు పండగ చేసుకునేది. ఇలా ప్రతి సంవత్సరాది పండగకూడా చాలా సంతోషంతో గడుపు తుండేవి.

ఒకనాడు ఏమి జరిగిందో తెలుసా! ఒక బాటసారి దోవనపోతూ ఆ రావిచెట్టు దగ్గరకు వచ్చి అన్నము తిని అక్కడవున్న మైలురాయిమీద తలవాల్చి కాసేపు నిద్ర పోయినాడు. నిద్రలేవగానే ఒక ఆవలింత ఆవలించి, "అబ్బా! ఈచెట్టు ఎంతమందికి తన ఆశ్రయము యిస్తోంది. అదిగాక దీని ప్రక్కనే ఈ రాయి ఉండటంవలన హాయిగా నిద్రపోవటానికి అనుకోవచ్చు." అనుకున్నాడు. తర్వాత మూట సర్దుకొని తనదోవన తాను పోయినాడు.

సాయంత్రం కాగానే రావిచెట్టు, మైలురాయీ రెల్లును చూచి నవ్వి, "నీవు ఎందుకూ పనికిరావు. మేము మానవులకు, జంతువులకు ఎంత సహాయపడుతున్నామో

డి. చంద్రశేఖర్, మద్రాసు.



చూడు" అని హేళనచేసినై. అదిమొదలు రావిచెట్టు మైలురాయి, నీచులతో మాట్లాడకూడదు అనుకుని, ఆ రోజునుంచి రెల్లుతో మాట్లాడటం మానివేసినై. పాపం రెల్లుకి ఏమిచెయ్యాలో తెలియక ఏడుస్తూ వూరుకుంది.

ఒకరోజున ఒక కూలివాడు వచ్చి చెట్టు దగ్గర ఉన్న మైలురాయిమీద జీడిపప్పు గింజలు తన గొడ్డలితో పగులకొట్టుకుని తిని, ఆ రావిచెట్టు ఎక్కి నాలుగు కొమ్మలు కొట్టుకొని తన దోవన పోయినాడు. సాయంకాలం కాగానే తన తల బద్దలుకొట్టాడని మైలురాయీ, తన కొమ్మలు కొట్టినందుకు రావిచెట్టూ ఒకరిబాధ ఒకరికి చెప్పుకుని చాలసేపు దుఃఖించాయి.

కొన్నాళ్ళకు రెండు నాగుపాములు వచ్చి ఆ రెల్లు పొదలో దూరినై. ఆ పాములు ఇక అక్కడనే ఉంటూవచ్చాయి. ఆ రెల్లు పొద చాల పెద్దదయింది. క్రమేణా దానిలో చాలా పాములు చేరినై.



ఒకనాడు ఒక పెద్ద కాపు ఇద్దరు కూలీలతో ఆ చెట్టును కొట్టుకుపోదామని ఆ చెట్టుదగ్గరకు వచ్చాడు. చెట్టుకు అడ్డంగా ఉన్న రాతిమీద తమ దగ్గరవున్న గొడ్డలిని ముట్టెవైపు తిప్పి ఒక దెబ్బ కొట్టాడు. రెండవవాడు రెల్లుపొద పక్కన నిలుచుని చెట్టుమొదలుమీద ఒక దెబ్బ కొట్టాడు. ఆ చప్పుడుకు పొదలోవున్న ఒక నాగుపాము, పొదపక్కన నిలుచునియున్న కాపును కరచింది. ఈ చప్పుడుకు ఆ పొదలోనుంచి యింకా రెండు పాములు



బయిటికి పోవటం చూచి కూలీలు భయపడ్డారు. పాము కాటు వేయగనే 'అమ్మో' అని అరుస్తూ కాపు కిందపడ్డాడు.

వెంటనే కూలీలు కాపుదగ్గరకు వచ్చి చేతులమీద ఎత్తుకొని, 'అయ్యో సామీ! ఇది దేముడిచెట్టు. అందువల్లనే ఇక్కడ నాగుపాములు ఉన్నై. ఇదిగో యిక్కడనే పాముపుట్ట. బాబూ, సుబ్రహ్మణ్యేశ్వరస్వామీ! మా తప్పు క్షమించు. మా కాపును రక్షించు, అయ్యా!'' అని మొక్కుకుని వాళ్లు ఆ కాపును తీసుకొని ఇంటికి పోయారు.

ఆ రోజు సాయంత్రం ఆ రావిచెట్టు, ఆ మైలురాయి రెల్లుకు దణ్ణంపెట్టి, ''బుద్ధి తక్కువై నీతో యిన్నాళ్లూ మాట్లాడలేదు. మమ్ము రక్షించినది ఆ పాములు. ఆ పాములకు ఆశ్రయము ఇచ్చినది నీవు. నీవలననే మా ప్రాణాలు దక్కినవి. అందువల్ల మమ్ము క్షమించి మా స్నేహమును అంగీకరించు'' అని బ్రతిమాలుకున్నై. అదిమొదలు రెల్లు, రావిచెట్టు, మైలురాయి చాల స్నేహంగా వుండసాగినై.

మరుసటిరోజున కాపు బతికాడు. తమ కాపు బ్రతికినందుకు కాపు ఇంటివారు, రైతులువచ్చి ఆ చెట్టుకు పాలుపోసి, ఆ రాతికి కుంకుమపెట్టి దణ్ణం పెట్టుకొని వెళ్ళిపోయినారు.

అప్పటినుంచి ఆ చెట్టు 'దేముడిచెట్టు' అయింది.

ఆ నాటి నించీ ప్రతి నాగులచవితికీ వూళ్లోవాళ్లందరూ వచ్చి చెట్టుకూ రాతికీ పసుపు కుంకం పెట్టి పుట్టలో పాలుపోసి పోతూవుంటారు.



# గురుశిష్యులు

వెనకటికి ఒకవూళ్లో ఒక గురువు వుండేవాడు. ఆయనదగ్గిర ఒక శిష్యుడు చదువుకుంటుండేవాడు. గురువుగారి పెళ్లాం గయ్యాళితనానికి పెట్టిందిపేరు. ఎప్పుడూ మొగుణ్ణి తిట్టి పోస్తుండేది. పాపం, గురువుగారు ఎదురు చెప్పకుండా ఆ తిట్లన్నీ సహిస్తుండేవాడు. శిష్యుడికి యిదంతా చాల ఆశ్చర్యంగా వుండేది. గురువుగారిని చూస్తే శిష్యుడికి ఎంతో జాలి వేసేది.

ఇలా వుండగా ఒకరోజున శిష్యుడు గురువుగారితో యిలా అన్నాడు - "గురువుగారూ, గురువుగారూ! ఎంతకాలమని యిలా మీరు భార్యచేతిలో రోజూ చివాట్లు తింటారు? నేను మీ దగ్గిర చదువుమొదలు పెట్టినదగ్గిర్నుంచీ చూస్తున్నాను. ఆమెగారి తిట్లు ఆ రోజు కారోజుకి మితిమీరి పోతున్నాయి. మరి కొన్నాళ్లు గడిస్తే చెయికూడా చేసుకుంటారేమో. అంతవరకు రాకముందే మరోపెళ్లి చేసుకుని సుఖంగా వుండకూడదా?" అని.

అప్పుడు గురువుగారు యిలా అన్నారు: "ఒరే, నువ్వు చెప్పింది బాగానేవుంది. కాని నా కిప్పటికే మూడువంతుల జీవితం గడిచిపోయింది. ఇంకెన్నాళ్లు బ్రతుకుతాను. ఈ భాగ్యానికి మరోపెళ్లి చేసుకోటం దేనికి. ఇలాగే మరో నాలుగేళ్లపాటు ముక్కు మూసుకున్నానంటే నా జీవితం వెళ్ల మారుతుంది. ఇప్పుడు ఎటొచ్చీ ఆలోచించవలసింది నీ సంగతి. పెళ్లి చేసుకుని సుఖంగా వుండవలసినవాడివి నీవు. అందుకని నా సంగతి అలావుంచి, నీ మటుక్కు నువ్వు జాగ్రత్తగా బుద్ధిమంతురాలైన పిల్లని పెళ్లి చేసుకో. కాని, ఒక సంగతిమాత్రం నిజం. నువ్వు ఎంత బుద్ధిమంతురాల్ని చేసుకున్నా కొన్నాళ్లయేసరికి నీ మీద సవారి చెయ్యకుండా వుండదు. ఇది నా అనుభవంమీద చెబుతున్నాను. నీవు పెళ్లి చేసుకుని కాపురం చేస్తుండేటంతవరకు నేను బ్రతికివుంటే నీ పెళ్లాం ఎంత బుద్ధిమంతురాలో నేను చూడకపోను."

పి. విజయకుమార్, ఒంగోలు,



"అలా అనకండి గురువుగారూ! అప్పటి దాకా మీరు బ్రతికేవుండాలి గాని, నేను చేసుకునేపెళ్లాం ఎంత బుద్ధిమంతురాలో మీరే కళ్లారా చూస్తారు" అన్నాడు శిష్యుడు.

* * *

కొంతకాలం గడిచింది. శిష్యుడి చదువు పూర్తిఅయింది. గురువుగారిదగ్గిర శలవు తీసుకుని తన స్వగ్రామానికి వచ్చేశాడు. మరి కొద్దిరోజులలోనే శిష్యుడికి పెళ్లి అయింది. మన శిష్యుడిపెళ్లాం గయ్యాళి తనంలో గురువుగారిపెళ్లాన్ని మించి పోయింది. పాపం, శిష్యుడు ఏం చేస్తాడు? గురువుగార్ని వెక్కిరించినందుకు తనకు మంచి ప్రాయశ్చిత్తంగా యిలాటి పెళ్లాం దాపరించిందనివిచారించాడు. ఎలాగోరోజూ చివాట్లు తింటూ సంసారం సాగిస్తున్నాడు.

ఇలా వుంటుండగా గురువుగారు శిష్యుడి గ్రామంమీదుగా ఆ ప్రక్కవూరు వెళ్లవలసి వచ్చింది. శిష్యుడెలావున్నాడో చూసిపోదా మని గురువుగారు శిష్యుడింటికి వచ్చారు. గురువుగారిని వాకిట్లో చూడగానే శిష్యుడికి ప్రైప్రాణాలు పైనే పోయాయి. కాసేపటికి తెప్పరిల్లుకుని కుశలప్రశ్న లడిగాడు.

"ఫలానావూళ్లో పనివుండి పోతున్నాను. ఇక్కడిదాకా వచ్చేసరికి నీ సంగతి జ్ఞాపకం వచ్చి ఎలోవున్నావో చూసిపోదామని వచ్చాను" అన్నారు గురువుగారు.

గురువుగారు ఆ పూటకి తన యింట్లో మకాం వెయ్యకుండా వెంటనే వెళ్లిపోతే బాగుండును అనుకున్నాడు శిష్యుడు మనసులో. కాని చూస్తూ చూస్తూ ఎలా వెళ్లమంటాడు! అందుకని, తనకి యిష్టం లేక పోయినా, "ఈ పూటకి యిక్కడవుండి భోంచేసి సాయంత్రం వెళ్దురుగాని" అన్నాడు శిష్యుడు.

"సరే" నన్నారు గురువుగారు.

అప్పుడు శిష్యుడికి పెద్ద దిగులు పట్టు కున్నది. "నా పెళ్లాం నన్ను రోజూలాగా ఇవాళకూడా ఛడామడా తిట్టి పోస్తుంది గామాలే. గురువుగారిని వెక్కిరించిన నా బతుకు ఆయనముందరే బైట బడుతుందే' అని.

"ఇప్పుడే వస్తాను, కూర్చోండి" అని దొడ్లో అంట్లు తోముతున్న పెళ్లాందగ్గిరికి వెళ్లి "ఏమే, మా గురువుగారు వచ్చారు. ఈ పూటకి మనయింట్లోనే భోంచేస్తారు. సాయంత్రానికి ఆయన దారిన ఆయన వెళ్లి పోతారు. ఈ ఒక్కరోజుమాత్రం, ఆయన వెళ్లిపోయేదాకా నన్ను రోజూలాగా తిట్టి పొయ్యబోకు. నా బ్రతుకు నవ్వులపాలు అవుతుంది," అని బ్రతిమాలుకున్నాడు.

అప్పటి శిష్యుడుమొహం చూసేసరికి ఆమెకి జాలివేసింది. "అలాగే, కాని నువ్వు నీ యిష్టంవచ్చినట్లు వాగావంటే నీ పరువు దక్కదు. నూరు తప్పులవరకు మాత్రమే నిన్ను నేను క్షమించి వూరుకుంటాను. ఆపైన ఒక్కతప్పు చేశావంటే నే నూరు కోను." అన్నది పెళ్లాం.

"సరే, నూరుతప్పులకు సెలవిస్తే ఇంకేం కావాలి!" అన్నాడు శిష్యుడు.



తిరిగి గురువుగారిదగ్గిరికివచ్చి కూర్చుని మాట్లాడుతున్నాడు. మాటల్లో మధ్య మధ్య "ఏమే, యింకా మడిగట్టుకు ఏడవలా" అనీ, "యింకా ఆ రోటిదగ్గిరే అఘోరి స్తున్నావా?" అనీ తన యిష్టంవచ్చినట్లు వాగేస్తున్నాడు. శిష్యుడిపెళ్లాం నోరు మెదల్చకుండా పని చేసుకుంటూ వుండటం చూసేసరికి గురువుగారు, "మొత్తా నికి నా శిష్యుడు మంచి పెళ్లాన్నే సంపా యించుకున్నాడే" అనుకున్నాడు. కాని అసలుసంగతి ఆయనకేం తెలుసు!



పెళ్ళాం నూరు శనగగింజలు ఒళ్లో పోసుకుని శిష్యుడు తిట్టు తిట్టినప్పుడెల్లా ఒక్కొగింజ తింటోంది. ఈ సంగతి పాపం శిష్యుడికి తెలియదు. నోటికి వచ్చినట్లు తిట్టేస్తున్నాడు.

ఇంతలో "వంట అయింది లేవండి" అని లోపల్నించి పిలుపు. గురుశిష్యులు భోజనాలకి కూర్చున్నారు. శిష్యుడు తన ధోరణిలో ఒళ్లుపై దెలియకుండా, "త్వరగా వడ్డించి అఘోరించు" అన్నాడు. పెళ్ళాం ఒక శనగగింజ నోట్లో వేసుకుంది. "కూర మూరు వడ్డించి ఏడు" అన్నాడు. మరో గింజ ఖాళీ అయింది. ఇలా ఛడా మడా తిట్టేస్తున్నాడు శిష్యుడు. తిట్లతోపాటు శనగగింజలూ అయిపోతున్నై. అప్పటికప్పుడే నూరు తిట్లు తిట్టేశాడు శిష్యుడు. పెళ్ళాం ఒళ్లోకూడా ఒక్క శనగగింజ మిగలలేదు.

పెళ్ళాం పులుసుచట్టి తెచ్చింది వడ్డించటానికి. "అలా వెధవమొహం వేసుకు నుంచుంటావేం. ముందు గురువుగారికి వడ్డించు" అన్నాడు శిష్యుడు. దాంతో నూటఒకటోతప్పు అయింది. ఇంకేం, ఆమె కళ్లు ఉరుముతూ "అలాగే వడ్డిస్తావుండు" అని ఆ పులుసుచట్టితెచ్చి శిష్యుడునెత్తిన కొట్టింది. దాంతో శిష్యుడికి కపాళమోక్షం అయింది. చట్టి అడుగు వూడిపోయి అంచు మాత్రం శిష్యుడిమెళ్లో కంటెలాగా వుండిపోయింది. పెళ్ళాం ఆ కంటెపుచ్చుకుని, "నూరుతప్పులకు సరే అన్నాకదానని నీ యిష్టంవచ్చినట్లు వాగుతావా? పులుసుపోతే పోయింది, ఆ చట్టిఖరీదు యిచ్చి మరీ కదులు విస్తరిముందునించి" అన్నది.

గురువుగారికి ఈ ఒక్కముక్కతో వ్యవహారమంతా తెలిసిపోయింది.

ఇక అక్కడవుంటే తనకి మూడుతుందేమోనని గురువుగారు మజ్జిగైనా పోసుకోకుండానే లేచి వెనక్కితిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.



# విఘ్నేశ్వరుని పెళ్లి

పెండ్లి అంటే విఘ్నేశ్వరునికి బలేయిష్టం. పెళ్ళి చేయమని వాళ్ళమ్మని, నాన్నని రోజూ అడిగేవాడు. ఓ రోజు వాళ్ళమ్మ యీ పోరు పడలేక వినాయకుడిని పెళ్ళికి కావలసిన పనులన్నీ చేసుకోమంది. వినాయకుడు చంకలుతట్టి, ఒక గంతువేసి యింట్లోంచి పరుగు పరుగునా వీథిలోకి వచ్చాడు. కాని యేం చెయ్యాలో తోచలేదు. అట్టే ఆలోచిస్తూ నడుస్తూ వున్నాడు.

కొంతదూరం వెళ్లేసరికి ఒక కోడిపుంజు ఎదురైంది. "ఓ కోడిపుంజూ! నా పెళ్లికి సహాయం చెయ్యవా?" అని అడిగాడు.

"చిత్తం! ఏంచెయ్యాలో చెప్పండి" అంది కోడిపుంజు.

పెళ్లికూతురికి కోక గావాలి, మాలవాడకుపోయి ఓ కొత్తకోక పట్టుకురా?" అన్నాడు.



సరేనని 'కొత్తకోకో' అని అరుచుకుంటూ బయలుదేరింది కోడిపుంజు. కాని మాలవాడఎక్కడో దానికి అంతు చిక్కలేదు. ఈ రోజువరకూ "కొత్తకోకో" అంటూ వెతుకుతునేవుంది. (అందుకనే మనకు "కొక్కొరోకో" అని యిప్పటికీ వినబడుతుంది).

తర్వాత విఘ్నయ్యకు ఒక గొఱ్ఱె కనిపించింది. దాన్ని కూడా కోరాడు, సహాయం చెయ్యమని. సరేనందిగొఱ్ఱె. "కంసాలి దగ్గరికెళ్లి మంగళసూత్రం చేయించుకురా" అన్నాడు.

సరేనని గొఱ్ఱె కంసాలి ఇంటికెళ్లి మంగళసూత్రం చేయించుకొని తిరిగివస్తూ, మతి మరపుచేత దారిలో దాన్ని పోగొట్టింది. దాన్ని వెతుక్కుంటూ తల వంచుకొని నేలవైపు చూస్తూతిరుగుతోంది. కాని ఈరోజువరకూ మంగళ సూత్రం దొరకలా. (అందుకనే గొఱ్ఱె నడుస్తున్నపుడు

చాకలకొండ సూర్యం, కనిగిరి.



తల వంచి నడుస్తూ వుంటుంది).

గణయ్య తిరిగిబయలు దేరాడు. కొంతసేపటికి ఓ కొక్కు రాయుడు ఎదు రయ్యాడు. దాన్ని కూడా సహాయం కోరాడు. సరే నంది పందికొక్కు.

"పిసనారివాళ్లు కొందరు నేలలో దాచిపెట్టిన వరహా లను తీసుకరా" అన్నాడు.

సరేనని కొక్కు గోడలన్నీ త్రవ్వసాగింది. కాని ఈ రోజు వరకూ వరహాలు కొక్కుకుదొరకలేదు. (అందు కనే పందికొక్కు గోడలకు నేలకు కన్నాలు త్రవ్వ తుంది).

మరి కొంత దూరం పొయ్యేసరికి గణపతికి ఒక మంచంలో ఒక మూణ్ణెల్ల పాపడు కనిపించాడు. వాడి ముఖం చందమామ లాగా కళకళలాడుతోంది. దగ్గర కెళ్లి సహాయం చెయ్యమన్నాడు. పాపడు నవ్వాడు.

"నువ్వు పెళ్లికి కుడు ములు చెయ్యి" అన్నాడు.



పాపడు కుడుములు చేస్తూ పిడికిళ్లు గట్టిగా పట్టాడు కాని, యీ రోజు వరకు పిడికిళ్లు విప్పనూ లేదు; కుడుములు పూర్తి కానూలేదు. (అందుకనే మూడు నెలల పాపలు పిడికిళ్లు గట్టిగా పట్టుకొని వుంటారు.)



సరే! యిక చుట్టాలను పిలవటానికి వెళ్లదామను కున్నాడు గణయ్య. ఐతే తన పెద్దపొట్టతో అట్టే దూరం నడవలేక చాలా అలసిపోయాడు.

ఇంతలో ఒక ఏనుగ ఎదురుపడింది. సంతో షంతో తన్నెక్కించుకోమని కోరాడు.

అప్పుడు ఏనుగు ఇలా అంది: "గణయ్యా! నీవు చాలా బరువు. నిన్ను నేను మొయ్యలేను. అదీ గాగ నీమనాలాంటిముఖమే కాబట్టి నాపైన నీవెక్కడం నాకు అగౌరవం" అని.

ఇది వినేసరికి మన గణయ్యకు బలే కోపం



వచ్చింది. "అలాగనా! నన్ను ఎగతాళి చేశావు గనక నీవు మందబుద్ధికలిగి పోదువుగాక" అని శపించి చరచరా వెళ్ళిపోయాడు.

ఏనుగు విచారంతో మందబుద్ధిగలదై ఇప్పటికీ ఆ శాపాన్ని అనుభవిస్తోంది.

కొంతదూరం వెళ్ళేసరికి ఒక గాడిద ఎదురైంది. గణయ్యకు ఉత్సాహం గలిగింది. ఎక్కించుకోమని అడిగాడు.

"అమ్మ, బాబోయ్! నీ బరువు మొయ్యటానికి నావల్లగాదు" అని గాడిద అరిచింది.

గణయ్యకు ఎక్కడలేని కోపంవచ్చింది. "సరే ప్రపంచంలో మనుష్యులు నీచేత ఎప్పుడూ బరువులే మోయిస్తారు" అని శపించాడు.

(అందుకనే పాపం గాడిద యిప్పటికీ బరువులు మొయ్యలేక తంటాలు పడుతోంది.)

మరి కొంతదూరంపోగా గణయ్యకు ఒక ఎలుక ఎదురై నమస్కారం చేసింది. "ఓహో! ఇది



చిన్నదైనా, వినయంగలిగి వుంది" అని అనుకొని తన్నెక్కించుకొని తిరుగమన్నాడు. సరేనని ఎలుక ధైర్యంగా గణయ్యను ఎక్కించుకుంది.

ఆరోజునించీ చుట్టాల్ని పిలవటానికి గణయ్య తిరుగుతున్నాడు, ఎలుక మీద. అయితే, దారిన



ఏదైనా తినుబండారాల వాసన తగిలిందంటేఅక్కడ ఆగి, అవి కొంచెం రుచి చూడందే ఎలుక కదలదు. అదీగాక, గణయ్యకు చుట్టాలు ముప్పైమూడు కోట్లమంది. వాళ్ళందరూ ఒక చోటలేరు కూడా. కాబట్టి ఎలుక ఇప్పటిదాకా గణయ్యను మోసుకుంటూ చుట్టాల గ్రామాలకు అక్కడకు ఇక్కడకు పరుగులు తీస్తూ యింకా తిరుగుతూనే వుంది.

పాపం, విఘ్నేశ్వరుడి పెళ్ళికి అన్నీ విఘ్నాలే! ఇంకా యిలాంటి వెన్నో జరిగినై! పాపలూ! మీరైనా సహాయంచేసి విఘ్నేశ్వరునికి పెళ్ళిచెయ్యరూ!!






పైబొమ్మలో స్టీమరుని మొదటిప్రయత్నంలోనే రేవుకి చేర్చండి, చూదాం.






## ఆధారములు

**అడ్డము :**

2. బాటలు.
5. పువ్వు.
7. ఒకరకం పురుగు.
8. ఓడ.
10. మనది ఆంధ్ర "—"
11. ఒక నదిపేరు.
12. దీనిమీద ప్రయాణించేస్తాము.
13. కేకి (తలక్రిందులు).
15. ఒక జంతువు.
17. స్వప్నము.
19. గుర్రము.

**నిలువు :**

1. సువాసన.
3. ఉప్పువల్ల 'ఇది' వస్తుంది.
4. వృక్షము.
6. నారి (తలక్రిందులు).
7. భర్త.
9. ఈడు.
10. సీత.
12. పాఠశాల.
14. అరుపు.
15. ముదర కానిది.
16. కరుణ.
18. దీనితో సీలువేస్తాము.

---

8 వ పేజీలోని బఫూను బొమ్మలకు జవాబు :

3, 8 నెంబర్లుగల యిద్దరు బఫూనులు ఒక్కమోస్తరువాళ్లు.

## అబ్బాయిలూ, అమ్మాయిలూ !

మీరు కథలుగాని, పాటలుగాని యింకా ఏవైనా రచనలుగాని మాకు పంపేటప్పుడు మూడు కానుల పోస్టుబిళ్లకూడా పంపాలి. మీరు పంపినవి వేసుకుంటున్నామో లేదో మీరు తెలుసుకోవాలన్నా, వేసుకోకపోతే వాటిని మీకు త్రిప్పి పంపాలన్నా ఈ మూడు కాన్లబిళ్ల పంపటం అవసరం. మీ రచన గురించి ఏమైనా తెలుసుకోవాలంటే రచనతోపాటే మూడుకాన్ల బిళ్లకూడా పంపాలి. రచన పంపినతర్వాత వ్రాసిన ఉత్తరాలకి జవాబు యివ్వటానికి వీలుండదు.

ఈ విషయాలు క్రొత్తవికావు. ప్రతినెలా మీకు చెబుతున్నవే. అయినా మీలో చాల మంది ఈ సంగతులు గుర్తుంచుకోవటం లేదు. అదీగాక మనం క్రొత్తసంవత్సరంలో ప్రవేశించబోతున్నాం గనక యిదే ఆఖరి సారిగా మీకు ఈవిషయం గుర్తుచేస్తున్నాను. జాగ్రత్తగా జ్ఞాపకముంచుకుంటారుగదూ?

—సంచాలకుడు.

### పజిలుకు జవాబు

| 1 తా | ■ | 2 దా | 3 రు | లు | ■ | 4 చె |
|---|---|---|---|---|---|---|
| 5 వి | 6 రి | ■ | చి | ■ | 7 ప | ట్టు |
| ■ | 8 నా | 9 వ | ■ | 10 జా | తి | ■ |
| ■ | ■ | 11 య | ము | న | ■ | ■ |
| ■ | 12 బ | స్సు | ■ | 13 కి | 14 కే | ■ |
| 15 లే | ది | ■ | 16 ద | ■ | 17 క | 18 ల |
| త | ■ | 19 హా | య | ము | ■ | క్ష |

## తప్పు చేసిందొకడు, తన్నులు తిన్నదింకొకడు!










రాగిణీ వారి
భక్త
జనా
తమిళం
తారాగణం: శాంతకుమారి, నాగయ్య.
హొన్నప్పభాగవతార్, సారంగపాణి మొదలైనవారు
డైరెక్టర్..
పి.పుల్లయ్య బి.ఏ.
ఆంధ్ర దేశానికి డిస్ట్రిబ్యూటర్లు:
వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ :: మద్రాసు :: బెజవాడ :: తాడిపత్రి

ఏప్రిల్ 9 వ తేదీన

ప్రారంభోత్సవము

# చంద్రలేఖ

## జెమినివారి

మహోజ్వల చలన చిత్ర కళా సృష్టి





# జాతీయతా ప్రబోధకములైన ఉత్తమ గ్రంథములు

**తెలుగుతల్లి** — రచయిత : శ్రీ మాగంటి బాపినీడు

తెలుగుదేశాన్ని గురించీ, వివిధశాఖలలో తెలుగువారి పూర్వ వైభవాన్ని గురించీ, ప్రస్తుత స్థితిగతులను గురించీ, పిల్లలకు ప్రియమైన తేటతెల్లమైన భాషలో, 100 కు పైగా చిత్రాలతో నిండిన ఆంధ్ర బాల సర్వస్వం. వెల రు. 2-0-0.

**1857 విప్లవం** — రచయిత : శ్రీ అశోక మెహతా

1857 లో జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సమరమూ, ఆ సందర్భములో జరిగిన ప్రధాన సంఘటనలూ భావోద్వేగముతో వివరించబడిన హృదయవిదారకమైన విప్లవగాథ. వెల రు. 1-8-0.

**ప్రజా పరిషత్తు** — రచయిత : శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

వివిధదేశాల రాజ్యాంగపరిషత్తులను గురించీ, భారతదేశ సమస్యలనూ, భారత రాజ్యాంగ పరిషత్తును గురించీ తెలుసుకొన గోరువారికి అమూల్యమైన గ్రంథము. వెల రు. 1-8-0.

**మానవుల హక్కులు** — రచయిత : శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

రాజకీయ పరిజ్ఞానార్థులందరూ విధిగా, శ్రద్ధగా చదువవలసిన గ్రంథము. వెల రు. 1-0-0.

**నిర్మాణ కార్యక్రమము** — మహాత్మా గాంధి, పట్టాభి, రాజేంద్రప్రసాద్

మహాత్ముల జాతీయాభ్యుదయకరమైన, నిర్మాణ కార్యక్రమమును గురించిన వివరణలతో, చేకాగితంమీద అచ్చు. వెల రు. 0-12-0.

**కాంగ్రెసు షష్ఠిపూర్తి** — రచయిత : పట్టాభి సీతారామయ్య

60 ఏండ్ల కాంగ్రెసు సంగ్రహ చరిత్ర. వెల రు. 0-12-0.

**జైహింద్** — రచయిత : శ్రీ కొండముది గోపాలరాయశర్మ

నేతాజీ సుభాషచంద్రుని స్వాతంత్ర్యసమర చరిత్ర. వెల రు. 1-6-0.

**అజాద్ జీవితము** — రచయిత : శ్రీ సింగరాచార్య

మౌలానా అజాద్ జీవిత కథలు. వెల రు. 1-4-0.

**"Successful Secretary"** (English) By Sri M. Bapineedu.

కార్యదర్శుల విధులూ, వివిధరకాల కార్యదర్శుల బాధ్యతలూ, కార్యక్రమాలూ, అనుష్ఠింపదగిన నియమాలూ యిందు పొందుపరుపబడినవి. ప్రతి కార్యదర్శి చదువవలసిన గ్రంథము. వెల రు. 3-8-0.

అన్నిటికీ పోస్టేజి ప్రత్యేకము :

**బాపూజీ చిత్ర జీవితం** (అచ్చులోనున్నది) — సంకలనం : బాపినీడు.

180 పైన బొమ్మలు క్లుప్తజీవితం, ఘట్టాలు, యాత్రలు.

**జాతీయ జ్ఞాన మందిరము,** రాయపేట :: మద్రాసు, 14.

Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1.
Editors CHAKRAPANI and K. RAJA RAO




*Photo by B. Ranganadham, Madras* *Chandamama April '48*

బాగుపడే పిల్ల!

PRINTED AT THE B. N. K. PRESS, 37, ACHARAPPAN ST. MADRAS - 1